


| | |
|---|---|
| ఆంధ్ర బ్రాంచి: | మద్రాసు ఆఫీసు |
| హిందూస్థాన్ బిల్డింగ్సు, | 107, ఆర్మీనియన్ వీధి, జార్జిటౌన్ |
| బకింగ్‌హాంపేటపోస్టు, విజయవాడ-2. | మద్రాసు-1. |

సంవత్సర చందా
రు. 12-0-0
విడిప్రతిక 4 అ.



సచిత్రవారపత్రిక
Founder : K. NAGESWARA RAO

సంపుటము 49
సంచిక 11
16.11-55

మన్మథ కార్తీక శుద్ధ విదియ బుధవారం

# పాఠకులకు మనవి

## దసరా పోటీలు

ఈ సంవత్సరం పిల్లల పోటీ చిత్రాలనీ రచనలనీ దసరాకి బదులు దీపావళికి ప్రచురించడం జరిగింది. కిందటి మూడేళ్లనించీ దసరా సంచిక యావత్తూ పిల్లల కోసమే ప్రచురించబడుతూవచ్చింది. ఈ సంవత్సరం అలా చెయ్యడానికి వీలు లేకపోయింది. ఈ సంచికలో పాతిక పేజీలుమాత్రం బాలసాహితి శీర్షిక క్రింద ప్రచురించగలిగాం. పై సంవత్సరనించీ యథాప్రకారం దసరా సంచికఅంతా పిల్లలకోసమే వినియోగించడానికి ప్రయత్నిస్తాం.

## బొమ్మలు

ఈ సంవత్సరం పోటీకి మొత్తం అయిదు వందలు పైగా ఎంట్రీలు వచ్చాయి. ఈమారు బొమ్మలు మంచివి చాలానే వచ్చాయి. కాని వచ్చినవాటిలో తొమ్మిది బొమ్మల కంటె ఎక్కువ అచ్చు వెయ్యడానికి వీలుపడలేదు. ఈ తొమ్మిది బొమ్మల్లోనూ రెండింటికి బహుమతు లివ్వబడుతున్నాయి. అయితే అంత మాత్రాన్ని మిగిలినవి బాగుండలేదని కాదు. అన్నీ బాగానే వున్నాయి-(పిల్లలపేరు చెప్పి పెద్దవాళ్ళు చెయ్యి చేసుకున్నవి తప్ప). మూడేళ్లనించీ ఒకసారిబహుమతిపొందినవాళ్లకిమళ్లీ బహుమతి ఇవ్వడంలేదు. అలాగే మిగిలినవాళ్లు కూడా ముందుముందు బహుమతులు గెల్చుకోవచ్చు - (మళ్ళీ యేడాదికి ఈడు పదిహేనేళ్లూ దాటిపోకుండా వుంటే).

గేయాలు ఈ సంవత్సరంకూడా మంచివి రానేలేదు.

## కథలు

ఇక మంచి కథలు రాసినవాళ్లు కొద్దిమందే. వాళ్ల కథల్లో మరీ కొద్దిగా మాత్రమే అచ్చువెయ్య వలసివచ్చింది. వీటిలో "అన్నయ్య" అనే కథ రాసిన చి॥ పుల్లెల రామకృష్ణారావుకి (13 సం॥) బహుమతి లభించింది.

సామాన్యంగా అన్నయ్య అనే సరికి తమ్ముడిమీద కొల్లలుగా ఆపేక్ష చూపించి త్యాగం చేసేసే గొప్పవాడనో, లేకపోతే ఇంట్లో అందర్నీ చికాకుపెట్టి ఏడిపించే స్వార్థపరుడు, పెంకిఘటం అనో రాస్తూవుంటారు. అల్లా కాకుండా, అన్నయ్య చలాయించే అథారిటీలో కనపడకుండా దాక్కునే ఆపేక్షనీ, సొంతబెంగల్లో పడి విసుక్కున్నా తిట్టినా కొట్టినా తమ్ముణ్ణి మరిచిపోని అన్నయ్య శ్రద్ధనీ అతి సహజంగా చిత్రించాడు చి॥ రామకృష్ణారావు. అన్నయ్యని పొగిడెయ్యలేదు, మరీ అంత తిట్టుకోలేదు. ఎలా ఉన్న వాణ్ని అలాకథలో ఇరికించాడు. పెద్దవాళ్ళు చెప్పకునే మాటల్ని బట్టీ, పత్రికల్లో చదివీ, లేనిపోని అభిప్రాయాలు తెచ్చిపెట్టుకొని రాయడం మొదలెడితే కథలు బాగుండవు. సహజంగా తోచిన విషయాల్ని సహజంగానే, ఆట్టే మెరుగులు దిద్దవలసిన పాట్లు లేకుండా రాస్తే ఎందుకు బాగుండవు? ఈ ఒక్క కథను గురించే ఇంత ఎందుకుచెప్పారు, మిగిలిన కథల్ని గురించి చెప్పక పోవడం అన్యాయుం అని కొంద

రసుకోవచ్చు. అది కొంత అన్యాయం అని ఒప్పుకోవాలి. కథలు ఎలారాస్తే బాగుంటాయి అని పిల్లల్లో ఎవరికేనా తోచవచ్చుగా! అందుకని మచ్చుకి బహుమతిఇచ్చిన కథని గురించి రాయడం జరిగింది. జడ కుచ్చులు, తిరుపతి ప్రయాణం మొదలైన మిగిలిన కథల్ని గురించి కూడా చెప్పవచ్చు. కాని అన్నింటిని గురించీ చెప్పడానికి ఇక్కడ చోటుచాలదు. అందుకోసం మిగిలిన వాళ్ళు ఏమీ అనుకోవద్దు. వాళ్ళు రాసినవీ మంచివే. బాగున్నాయి. బొమ్మలూ కథలూ మిగిలినవాటిలో బాగున్నవాటిని క్రమంగా బాల సాహితిలో ప్రచురిస్తాం.

## దీపావళి సంచిక:

మరి దీపావళి సందర్భంలో ఒక్క మాట. మా కోరిక మన్నించి సహృదయులు చాలమంది దీపావళి సంచికకోసం కథలు, గేయాలు, చిత్రాలు, ఫొటోలు పంపారు కొన్ని ఆలస్యంగా చేరాయి— ముఖ్యంగా ఫొటోలు, చిత్రాలు. అందువల్ల వచ్చినవాటిలో చాల వరకు ఉపయోగించలేక పోయాం.

> **గమనిక**
>
> స్థలాభావంచేత ఈవారం అబల సీరియల్, బాలసాహితి సీరియల్ మార్టిన్ రాట్లర్, వనితాలోకం ప్రచురించడం లేదని పాఠకులు గమనించ ప్రార్థన. —సం॥

కొందరి రచనల్ని స్థలాభావంవల్ల అచ్చువెయ్యలేకపోయాం. ఇందుకు రచయితలు, చిత్రకారులు, ఫొటోగ్రాఫర్లు మన్నించాలని మా ప్రార్థన. వీలున్నంతవరకు రచనల్ని క్రమేణా ప్రచురించగలం. చోటు చాలనందువల్ల ఈవారం వనితాలోకం, అబల (సీరియల్), బాలసాహితి సీరియల్ (మార్టిన్ రాట్లర్) ప్రచురించ బడ లేదు. వైవారంనించీ అవి యథా ప్రకారం ప్రచురించబడతాయి.

## పండుగ అభినందనలు:

ఈ పండుగనాడు దేశమంతా ఆసేతు హిమాచల పర్యంతం రంగురంగుల వెలుగులతో ప్రకాశిస్తుంది. ప్రమాదకరమైన ప్రేలుడు సామగ్రి ఉపయోగించరాదని భారతప్రభుత్వం హెచ్చరించింది. చప్పుళ్లు పెద్దవైతే చెవులు చిల్లులు పడ్డం, ప్రమాదాలు సంభవించడం తప్పితే ఏమీ ఉండదు. రంగురంగుల కాంతులీనే మతాబాలు చిచ్చుబుడ్లతో అవి పోలిక రావు.

ఈ పండుగ మా పాఠకులకు, రచయితలకు, అందరికీ శుభం చేకూర్చాలని మా కాంక్ష.

—సంపాదకుడు.

# ఆమె సౌందర్యవతి

# ఆమె లక్షణవతి

# ఏలననగా

అద్దకము, రంగు
మెర్సిరైజు చేసిన

## ఖటావ్ వాయిల్స్

ధరించును



ది ఖటావ్ మకన్‌జీ స్పిన్నింగ్ అండ్ వీవింగ్ కంపెని, లి.
మిల్సు: శైవులా బొంబాయి ఆఫీసు లక్ష్మీ బిల్డింగ్.
బెల్లార్డుపియర్ బొంబాయి 1

బట్టలషాపు: మూల్‌జీజాతా మార్కెట్టు గోవింద్ చౌక్,
బొంబాయి 2 చిల్లర బట్టలషాపు: హైదర్ అలీ, చాందినీ
చౌక్ ఢిల్లీ చిల్లరబట్టలషాపు:

[illegible], నేతాజీ సుభాష్ చంద్రబోస్ రోడ్డు, మద్రాసు

# నిరాలా

## సబ్బు



బట్టలను ఉతకడం
అతితేలిక

బట్టలను బండకువేసి బాదడం, నడుములు విరిగేటట్టు ఉతకడం అవసరం లేదు. ని రా లా సబ్బుకు చాలా నురుగు గబగబా వస్తుంది గనుక అతితేలికగా, శుభ్రంగా, బట్టలు చిరగకుండా ఉతకవచ్చు.



తుక్కు
ముక్కలు
లేవు

తుంగభద్ర ఇండస్ట్రీస్ లిమిటెడ్
కర్నూల్




ఆశ్వీయుజమాసం శరన్నవరాత్రాలతో ప్రారంభిస్తున్నది; దీపావళీమహోత్సవాలతో అంతంపొందుతున్నది. యావద్భారతదేశంలో సమస్తజనం సంతోషంతో పాల్గొనే పండుగల్లో దీపావళి అతి ప్రధానమైనదని చెప్పవచ్చు.

దీపావళి కొందరిమతంలో పదమూడు రోజుల పండుగగా భావింపబడుతున్నా, నేడు ప్రధానంగా ఇది (1) నరక చతుర్దశి, (2) కార్తీక అమావాస్య, (3) గోవర్ధనోద్ధరణ, (4) యమద్వితీయ అనే నాల్గురోజుల పండుగగా వొప్పుతూవున్నది. ఆశ్వీయుజ బహుళ త్రయోదశి నిఘనత్రయోదశిగా చేర్చి, అయిదుదినాలు పండుగగాగూడా దీపావళిని నిరూపించే ఆచారంకూడా వుంది.

ఉత్తరభారతంలో దీపావళిని లక్ష్మీపూజగాను, వంగదేశంలో కాళీ పూజగాను, దక్షిణభారతంలో రావణ వధానంతరం శ్రీరాముడు తిరిగి అయోధ్యకువచ్చి పట్టాభిషిక్తుడైన పండుగగాను భావిస్తారు. జైనులు కార్తీకకృష్ణచతుర్దశిని మహావీరుని 'నిర్వాణలక్ష్మి' దివసంగాను, అమావాస్యను మహావీరుని శిష్యుడైన ఇంద్రభూతికి 'జ్ఞానలక్ష్మి' సంక్రమించిన దివసంగానూ ఉపలక్షిస్తారు. జైనులు మహావీరుని నిర్వాణ కారణంగా దేవతలు, మానవులు దీపమాలికలతో ఉత్సవాన్ని జరపటమే నేటిదీపావళికి ప్రధాన 'సంజ్ఞ' అని పలుకుతున్నారు.

దీపావళీ మహోత్సవాల పరిణామాన్ని గురించి విశేష విచారణచేసిన గుప్తే మహాశయుడు తన "హిందువుల పవిత్ర దినములు" అనే గ్రంథంలో క్రింది రీతిగా సంగ్రహించాడు:

"I solicit the attention of ethnographists to the chief points I have thus been able to disclose out of the multiplicity of accounts of the origin of DIPAVALI—(1) The change of season. (2) the death of the rice-crop harvest (3) the time of manuring the soil

## వావిలాల సోమయాజులు

for the second crop (4) the Sun reaching LIBRA, the seventh sign of the Zcdiac (5) The coronation of Rama (6) the selection of this coronation day for the conventional coronation and era-making day of Vikramaditya, the last of the Guptas"

(Hindu Holidays—P. 39)

ఇంతేకాక కొందరు దీపావళిని అశోకుని కళింగ విజయోత్సవ సూచకమైన పండుగలుగా కూడా భావిస్తున్నారు

భారతీయులు సమస్త చైతన్యాన్ని, జ్యోతిగా భావించారు. మహర్షులు పరమాత్మనే స్వయం ప్రకాశంగల 'ఆదిదీపం'గా దర్శించారు. 'న తత్ర సూర్యో భాతి, న చంద్ర తారకా నేమా విద్యుతో భాంతి కుతోఽయ మగ్నిః, యస్య భాసా సర్వమిదం విభాతి, తస్మై జ్యోతిషాయ బ్రహ్మణే నమః" అని ఆ 'ఆదిజ్యోతి' ప్రకాశం సహస్ర సూర్యుల కాంతిని మించినదని కీర్తించారు. ఆ జ్యోతి మానవాంతరాళాలల్లో శుద్ధ దీపంగా ప్రకాశిస్తున్నట్లు భారతీయులు నమ్ముతున్నారు. పరబ్రహ్మకు ప్రతీకలుగా నిలిచే దీపాలకు విశేష ప్రాముఖ్యాన్ని మనవాళ్లు నిరూపించారు. దీపదాన మహిమాదికాలను పురాణ గ్రంథాలల్లో వివరించారు. దీపసేవ వల్ల కలిగే ప్రయోజనాన్ని గురించి—

"ఎన్ని నిమిషములు దైవత
సన్నిధి వెలుగంగ జనుడు ప్రదీపం
అన్ని సుర వత్సరములు సు
ఖోన్నతి సన్నుతుల నాతఁ
డొప్పెడు దివమునన్."

(తిక్కన—ఆనుశాసనిక పర్వము.)

అని స్పష్టీకరించారు. వివిధ ప్రయోజనాలనాసిస్తూ దేవతాపూజ చేసే భక్తకోటి ఉపయోగించవలసిన వ్యాఘ్ర, గజ, నాగ, గరుడ, వృక్ష, పక్షి, పిక, కిన్నరాది దీప నిర్మాణానికి శిల్పశాస్త్రాలల్లో ప్రక్రియలు చెప్పిఉన్నవి. ఇట్టి మహత్వంగల దీపాలకు విశేష ప్రాముఖ్యంగల పండుగలు మన దీపావళీ మహోత్సవాలు.

దీపావళి లేక దీపాళి శబ్దం ప్రాచీన భారతీయ గ్రంథాలల్లో కన్పించటంలేదు అందువల్ల కొందరు దీనిని మధ్యయుగంలో ఆరంభించిన పండుగగా భావిస్తున్నారు కాని ఇది ప్రాచీన కాలంలో యక్షరాత్రి అనే పేరుతో వ్యవహరింపబడుతూ, కాలక్రమేణ దీపావళి పండుగ అయినదని చారిత్రక పరిశోధకులు నిరూపించినారు. [J G. J. R. I Vol III Pts II P. 205- పి. కె. గోడే మహాశయుని వ్యాసము].

పురుషోత్తమదేవుడు తన త్రికాండశేషంలో యక్షరాత్రి, దీపావళిశబ్దాలను సమానార్థకాలుగా వ్యవహరించినాడు. ప్రాచీనుడు, మహర్షి అయిన వాత్స్యాయనుడు తన కామసూత్రాలల్లో యక్షరాత్రి ప్రశంస చేసినాడు. కామసూత్రములకు వ్యాఖ్యానం వ్రాసిన జయమంగళుడు (క్రీ. శ. 10 వ శతాబ్దము) ఈ యక్షరాత్రినిగురించి "యక్షరాత్రి రితి సుఖరాత్రిః యక్షాణాం తత్ర సన్నిధానాత్। తత్ర ప్రాయశో లోకస్య ద్యూతక్రీడా" అని వ్యాఖ్యానించినాడు. దీనికి పక్షరాత్రి అని వేరొక పేరున్నట్లు, ఇది మాఘ శుక్ల పంచమినాడో లేక కార్తీక పూర్ణిమనాడో జరుపబడుతున్నట్లు తెలుస్తున్నది. సంస్కృత నిఘంటుకారుడు రామనారాయణ ఆప్టే యక్షరాత్రిశబ్దాన్ని లక్ష్మీదేవిని ఉద్దేశించి వెలిగించే దీపమాలికలు కలది అని నిర్వచించాడు.

యశోధరుని యక్షరాత్రి హేమచంద్రుని కాలానికి జక్షరాత్రి, దీపాళి అయినది. హేమచంద్రుడు, యుగంధరుడూ యక్షరాత్రికి లక్షణాలుగా పలికినయక్షసన్నిధి, ద్యూతక్రీడల్లో, తరువాతకాలంలో ద్యూతక్రీడ కనిపిస్తున్నది కాని యక్షసన్నిధి కని

(10 వ పేజీ చూడండి)



దీపికా విజయం

—వడ్డాది పాపయ్య.

# దీపావళీ మహోత్సవాలు

పించటంలేదు. హేమాద్రి (క్రీ.శ. 13వ శతాబ్ది) వ్రతఖండంలో "సుఖసుప్తిక" అనే ఒక వ్రతాన్ని పేర్కొన్నాడు. ఈ సుఖసుప్తిక, యక్షరాత్రి, సుఖరాత్రి సమానార్థకాలు. హేమాద్రి వ్రత ఖండంలో సుఖసుప్తికనుగూర్చి చెప్పిన లక్షణాలు చతుర్వర్గ చింతామణి గ్రంథంలోని సుఖరాత్రి లక్షణాలతో సరిపోతున్నది.

క్రీ. శ. 6, 7 శతాబ్దాలల్లో ఆదిత్య పురాణాన్ని అనుసరించి కాశ్మీర దేశంలో నీలమత పురాణం పుట్టింది. అందులో కార్తీక అమావాస్యనాడు వెలిగించవలసిన దీప మాలికల లక్షణం కనిపిస్తున్నది. ఈ ఆదిత్య పురాణాన్ని క్రీ. శ. 1030 ప్రాంతంలో అల్బెరూనీ పండితుడు చూచాడు. (Puranic Records—Dr HAZRA P. 90) హేమాద్రి వ్రత ఖండాన్ని బట్టీ, నీలమత పురాణాన్ని బట్టీ సుఖ సుప్తిక లక్షణాలు క్రిందివిధంగా కనిపిస్తున్నవి. (1) ఈ పండుగను కార్తీక అమావాస్యనాడు జరపాలి (2) ప్రదోష సమయానంతరం లక్ష్మిని (కరీషిణి) పూజించాలి (3) రోగులు, బాలబాలికలు తప్ప మిగిలిన వారంతా పగలు ఉపవాసం చెయ్యాలి, (4) సాయంత్రం సర్వ ప్రదేశాలనూ దీప మాలికలతో అలంకరించి అతిథి సంతర్పణలతో గడపాలి. ఈదినం రాత్రి ద్యూత క్రీడ చెయ్యాలని హేమాద్రి చెప్పినాడు. కార్తీక శుద్ధ ప్రతిపత్తునాడు పార్వతితో శివుడు ద్యూతక్రీడ సల్పి ఓడిపోయినాడట! ద్యూతానంతరం దంపతులు సుఖశయ్యనేర్పరచుకుని దీపమాలికలమధ్య సుఖశయనం చెయ్యాలని హేమాద్రి వ్రతఖండంలో చెప్పినాడు.

పైన పేర్కొన్న సుఖసుప్తిక, యక్షరాత్రి, సుఖరాత్రి అనే నామాలతో ప్రాచీన కాలంలో ఉన్న పండుగల లక్షణాలన్నీ నేడు దీపావళి పండుగల్లో కనిపిస్తున్నవి. దీనినిబట్టి క్రీ. శ. మొదటి నాల్గు శతాబ్దాల కాలంలో యక్షరాత్రి పేరుతోనూ, అయిదు మొదలు ఎనిమిదవ శతాబ్ది వరకూ సుఖసుప్తిక అనే నామంతోనూ వ్యవహృతమై హేమచంద్రుని కాలానికి (క్రీ. శ. 1000 ప్రాంతము) దీపావళి ఉత్సవంగా పై పండుగ పరిణమించినదని చరిత్రకారులు నిర్ణయించినారు. క్రీ. శ. 15వ శతాబ్ది తరువాత పుట్టిన కమలాకర భట్టు నిర్ణయసింధువు, ధర్మసింధువు మొదలైన గ్రంథాలల్లో దీపావళినాటి కర్మకాండ విపులంగా కనిపిస్తున్నది.

నేటి దీపావళి పండుగ అయిదురోజుల ఉత్సవాలుగా పరిణమించటానికి ముందుగా ఎన్నో పరిణామాలను పొందినట్లు మనకుఅర్థమైంది. విష్ణువు చాతుర్వర్ణ్యానికీ నాలుగు వ్రతదినాలను నియమించాడట! బ్రాహ్మణులకు శ్రావణ శుద్ధ పూర్ణిమ (రక్షాపూర్ణిమ), క్షత్రియులకు విజయదశమి, వైశ్యులకు దీపావళి (తులాసంబంధి కనుక), శూద్రులకు వసంత పంచమి—ఈ నాలుగు వ్రతదినాలు.

దీపావళి పండుగకూ కాలగమనానికీ విశేషసంబంధం ఉన్నట్లు కనిపిస్తున్నది. ఈ పండుగలకు సూర్యుడు తులారాశి (LIBRA)లో ప్రవేశిస్తున్నాడు. తులారాశి చిత్రార్థము, స్వాతి, విశాఖ ¾ లతో కూడిఉంది. కృత్తిక మొదలుకొని విశాఖవరకూ ఉన్న నక్షత్రాలు క్రాంతి వృత్తంమీద ఉత్తరార్థ గోళంలో ఉన్నవి. విశాఖ మొదలు భరణి వరకూ దక్షిణార్థగోళంలో ఉన్నవి. విశాఖ నక్షత్రం మొదలు ఒక నూతన శాఖ ప్రారంభించుట వల్లనే విశాఖకు వి—శాఖ అన్న పేరు వచ్చింది. "కృత్తిక మొదలు విశాఖవరకు ఉన్న నక్షత్రాలు, దేవ నక్షత్రాలూ, విశాఖ మొదలు భరణివరకు ఉన్న నక్షత్రాలు యమ నక్షత్రాలు" అన్న అభిప్రాయాన్ని వ్యక్తం చేసే మంత్రాలు వేదంలో "దేవా గృహావై నక్షత్రాణి... కృత్తికా ప్రథమం, విశాఖే ఉత్తరం... తాని దేవ నక్షత్రాణి, అనూరాధా ప్రథమం, అపభరణీ ముత్తరం...తాని యమ నక్షత్రాణి, యాని దేవ నక్షత్రాణి దక్షిణేన పరియసతి. యాని యమనక్షత్రాణి తాన్యుత్తరేణ" ఇత్యాదిగా గోచరిస్తున్నవి. దివారాత్రాలను, శీతోష్ణాలను ఈ తులారాశి సరిసమానంగా తూచి పంచి యిస్తుంది కనుక తుల అనే నామాన్ని ధరించింది. మధ్య దేశాధిపతి అయిన శిబిచక్రవర్తి అగ్ని పక్షికి ఆగిన పవిత్రస్థానము తుల. ఈ రాశిని చాల్డియా, అసీరియా, అకేడియా జాతుల వారు కూడా 'తుల్క' (తుల-Balance) సమానంగా కాలాన్ని తూచి యిచ్చునదిగా పరిగణించారు. ఈ రీతిగా దీపావళి పండుగలు సూర్య భ్రమణాన్ని సూచిస్తూ కాలంలో కల్గిన మార్పును నిరూపిస్తున్నవి.

సామాజికాచార శాస్త్రజ్ఞులు దీపావళి తొలుత ఒక పైరు పండిన తరువాత రెండవ పైరుకు పొలాలకు ఉన్న పెంట నంతటిని ఎరువుల క్రింద తోలివేసి పెంటను వదిలించుకోటమని ఒక ఆచారాన్ని ఆధారంగా చేసుకొని పుట్టిందని భావిస్తున్నారు. నరకుడు ఆ పెంటకు ఒక సంకేతం అని, అతని సంహారము ఒక రాక్షసి మృత్యువును (The death of the giant filth) ను సూచిస్తున్నదని భావిస్తున్నారు. నరకుడొక నక్షత్రరాశి యనియు, సూర్యుడు తులలో ప్రవేశించిన పిమ్మట నా రాశి యస్తమించుటచే దీపావళిపండుగలలో నరక సంహార సూచకమైన నరక చతుర్దశి యున్నదని జ్యోతిష శాస్త్రవేత్తల అభిప్రాయము.

అశ్వియుజ శుద్ధదశమి (విజయదశమి నాడు) నాడు శ్రీరామచంద్రుడు రావణుని సంహరించి విజయము నొంది అమావాస్య నాటికి అయోధ్యకు వచ్చి పట్టాభిషిక్తుడైనాడనియు, నాకారణముననే యొక నూతన శకారంభకర్తయైన విక్రమాదిత్యుడును దీపావళి అమావాస్యనాడు పట్టాభిషిక్తుడైనాడనియు, శ్రీరామచంద్రుని అభిషేకసమయంలోనూ, విక్రమాదిత్యుని అభిషేక సమయం నాడూ ప్రజలు చేసిన మహోత్సవాలల్లో వెలిగించిన దీపాలు నేడూ సాంకేతికంగా వెలిగింపబడుతున్నవనీ కొందరి అభిప్రాయము. మహారాజచంద్రులైన శ్రీరామచంద్రుడు, విక్రమాదిత్యుడు ఇరువురిలో ఒకరు విష్ణుమూర్తి, రెండవ వారు విష్ణ్వంశసంభూతుడు. విష్ణువు ఆదిత్యుల్లో ప్రథముడు కావటంవల్ల సూర్యుడు తులారాశికి రావటానికీ వారి పట్టాభిషేకాలు జరుగటానికీ గల సంబంధాన్ని మనం ఊహించవచ్చు. ఇరువురు రాజన్యులూ రాక్షసత్వంమీద జయంపొంది లోకాలకు మేలును చేకూర్చిన వారు.

దీపావళి అయిదు దినాల పండుగ. భారత దేశంలో కొన్ని ప్రాంతాలవారు ఈ ఐదు దినాలల్లో కొన్ని రోజులకే ప్రాధాన్యం ఇస్తారు. ఆంధ్ర దేశంలో నరక చతుర్దశి, దీపావళి అమావాస్య రెండే ముఖ్యమైన రోజులు. వంగ దేశస్థులు ఈ పండుగను కాళీపూజ, దుర్గా పూజగా భావిస్తారు. అమావాస్యనాడు అర్థరాత్రి వేళ వంగదేశీయులు గృహద్వార తోరణాలనూ, నదీ తీరాలనూ దీప మాలికలతో అలంకరించి కాళిని కాళరాత్రినిగా పూజిస్తారు. ఈ కాళి మహామాయ. "దీపావళీయ యా ప్రోక్తా కాళరాత్రిస్తు సామతా" అన్నది వీరికి ప్రమాణము.

జైనులు దీపావళి కేవలం తమ పండుగనీ, రాముడు అమావాస్యనాడు రాజ్యాభిషిక్తుడైనట్లు రామాయణంలో ప్రమాణం లేదు గనకనూ, కొందరు భావిస్తున్నట్లు బౌద్ధ సంప్రదాయంలో ఎక్కడా అది అశోక విజయ సూచకమైన పండుగ కూడా కాజాలదనీ అంటారు. వారి మతంలో దీపావళి వారి తీర్థంకరులలో ముఖ్యుడైన మహావీరుడు నిర్వాణాన్ని పొందిన శుభోత్సవానికి

చిహ్నంగా భారతీయులు జరుపుకుంటున్న పండుగలు. ప్రాచీన జైనాగమ గ్రంథాల్లో 'జ్ఞాన' 'నిర్వాణ' పదాలు 'లక్ష్మి' శబ్దంతో సూచితమైనవట! అందువల్ల తరువాత కాలంలో లక్ష్మీపూజ కూడా ఆనాడు జరగటం సంభవించింది అని జైనుల భావన. కార్తీక కృష్ణ చతుర్దశి నాటిరాత్రి మహావీరునికి నిర్వాణ లక్ష్మి, కార్తీక అమావాస్యనాడు అతని ముఖ్య శిష్యునికి జ్ఞానలక్ష్మి ప్రాప్తించినవట! ఆ విశేషాలను సూచి దేవతలు రాక్షసులు మానవులు దీప మాలికలను వెలిగించి నిర్వాణోత్సవాలు జరిపించారట!! ఇదే దీపావళి ఉత్సవానికి మూలమట!! ఈ విషయాన్ని క్రీ. శ. (783) నాటి ఆచార్య జినసేనుని హరివంశ పురాణంలో క్రింది రీతిగా నిరూపించినారు.

"జ్వలత్ప్రదీపాలికయా ప్రవృద్ధయా
సురాసురైః దీపితయా ప్రదీప్తయా।
తదా స్మ పావానగరీ సమంతతః
ప్రదీపితాకాశతలా ప్రకాశతే॥
తతస్తులోకః ప్రతివర్ష మాదరాత్
ప్రసిద్ధ దీపావళి యాత్ర భారతే।
సముద్యతః పూజయితుం జినేశ్వరమ్
జినేంద్ర నిర్వాణ విభూతి భక్తిభాక్ ॥"

'జ్ఞాన దీప'మైన జినదేవుడు నిర్వాణం పొందాడు కనుక అతని శిష్యులు పద్దెనిమిది మంది మహారాజులు సభచేసి భౌతిక పదార్థ దర్శనాలకోసం దీపమాలికలను వెలిగిద్దామని నిర్ణయించారట. ఆనాటి నుండి జైనుల మతంలో దీపావళి ఆరంభించింది. అంటే క్రీ॥ పూ॥ 6 శతాబ్ది పూర్వ భాగంలో నన్నమాట.

జైనులకు దీపావళి నాలుగుదినాల పండుగ. మొదటి దినం ఇంట్లో లక్ష్మి తుల్యాలని భావింపబడే విలువైనఅన్ని వస్తువులకూ పులికాపు చేస్తారు. రెండవనాడు విందులతో దానధర్మాలతో పేదసాదలను సంతృప్తి పరుస్తారు. మూడవనాడు దస్తరాలను పూజిస్తారు. సాయంత్రం శారదా పూజచేస్తారు. వారికి (జైనవ్యాపారస్తులకు) దీపావళితో సంవత్సరాంతము కనుక నూతనమైన చిఠాల మీద వారి పురోహితుడు శారదా పూజానంతరం 'శ్రీ' కారాన్ని లిఖిస్తాడు. అది మేరు పర్వత రూపంలో ఉండాలట! తరువాత దస్తరాలమీద ఒక పాత రూప్యాన్ని ఉంచి పూజిస్తారు. దానిని సంవత్సరాంతం వరకూ తమ దగ్గరఉన్న డబ్బుతో కలపరు. ఆ రూప్యం అధికమైన ధనాన్ని తెచ్చిఇచ్చే వస్తువని వారి నమ్మకం. నాల్గవనాడు బంధువులతోనూ, స్నేహితులతోనూ కలిసి విందులు చేసుకొని నూతన వస్త్రాలంకరణలతో, సంగీత సాహిత్య గోష్ఠులతో ప్రొద్దుపుచ్చుతారు. దీపావళి నాడే క్రొత్త వ్యాపారాలు ఆరంభించి కొద్ది దినాల్లో దివాలా ఎత్తుతుంటారు కొందరు వ్యాపారస్తులు. వాళ్లను గురించి ఒక హిందీకవి చిత్రంగా "ఏసి ఆయీ దివాలీకి, దివాలా నికాలా" అని చమత్కరించాడు.

బొంబాయి రాజధానిలో చంద్రసేన్ ప్రభుజాతి వారు ఆశ్వీయుజ బహుళ అష్టమినాడు దీపావళి ఉత్సవాలల్లో ఒక కర్మ అయిన బలి పూజచేసి, ఆనాడే దీపావళి ఉత్సవాన్ని కూడా జరుపుతారు. వారు వండిన పిండితో బలి మహారాజు, అతని భార్య, మంత్రి బొమ్మలనుచేసి పూజించి తరువాత గుర్రంమీద ఎక్కించి రాజోచిత మర్యాదలతో మేళతాళాలతో ఊరేగిస్తారు.

దీపావళి అయిదు దినాల పండుగగా, ఎంచినప్పుడు మొదటినాడు ధనత్రయోదశి. నరక శబ్దానికి 'బాధ' 'క్లేశము' అని అర్థాలు. ఈనాడును పండుగ దినంగా భావించేవారు ఏం చేస్తారో చెప్పటానికి తగిన ఆధారాలు కనిపించవు. రెండవ నాడైన ఆశ్వీయుజ కృష్ణ చతుర్దశి నరక చతుర్దశి. నరకుడు ప్రాగ్జ్యోతిషాధిపతి. నరకుని సంహారాన్ని సూచించే పండుగదినం నరకచతుర్దశి. నరకుడు ఒక కాలవిభాగానికి సంకేతంగా కనిపిస్తున్నాడు. అతడు వరగర్వంవల్ల ఇంద్రాది దేవతలను జయించి పదహారు వేల మంది గోపికలను అపహరించి చెరలో పెట్టటం, గోశబ్దానికి సూర్యకిరణమనే అర్థం ప్రసిద్ధంగా ఉండటంవల్ల, ఇది సూర్యకిరణ ప్రసారాన్ని అడ్డుకునే ఒక కాలభాగం అంతరించటాన్ని సూచిస్తున్నదని మనం భావించవచ్చు. నరకాసుర

# దీపావళీ మహాత్మ్యాలు

సంహారం రాక్షసాంశపై దేవాంశ విజయం పొందటాన్ని సూచిస్తున్నది.

నరక చతుర్దశినాడు "తైలే లక్ష్మీః జలే గంగా దీపావళ్యాః చతుర్దశీం (ప్రాప్య) ప్రాతః స్నానంతు యః కుర్యాత్ యమలోకం నపశ్యతి" అన్న ప్రామాణ్యాన్ని అనుసరించి భారతీయులు ప్రాతః కాలంలో అభ్యంగన స్నానం చేస్తారు. ఆనాడు తైలమునందు (నూనె) లక్ష్మి, జలములందు గంగ ఉంటారట! ఆనాడు ప్రాతః స్నానం చేసిన వారికి యమలోక దర్శనం ఉండదట! స్నాన మధ్య సమయంలో ఉత్తరేణు, తుమ్మి, తగిరిస ఆకులను భుజాలమీదగా త్రిప్పి పారవేయవలసిందని ఆచార గ్రంథాలు చెపుతున్నవి. ఆనాడు యమతర్పణము విడవాలి. ఈ తిలతర్పణం చేసేటప్పుడు దక్షిణాభిముఖంగా ఉండాలి. ఆ సందర్భంలో యమధర్మరాజును "యమాయ ధర్మరాజాయ మృత్యవే చాంతకాయచ, వైవస్వతాయ కాలాయ సర్వభూతక్షయాయచ, ఔదుంబరాయ దధ్నాయ నీలాయ పరమేష్ఠినే, వృకోదరాయ చిత్రాయ చిత్రగుప్తాయ వైనమః" అన్న నామాలతో తర్పణం విడవాలి. ఈ తిలతర్పణం విడవటం నిర్ణయసింధువు మొదలైన ధర్మశాస్త్ర గ్రంథాలు జీవపితరులకు (తలిదండ్రులు బ్రతికి ఉన్నవారు) కూడా విధిగా నిర్ణయించినవి. మన దేశంలో కొన్ని ప్రాంతాలవారు నరకుణ్ణి తమ బంధువునుగా భావించి ఆత్మబంధువైన అతని మృతికి నిదర్శనంగా ఒక స్నానాన్ని, విష్ణువిజయాన్ని కాంక్షిస్తూ ఒక స్నానాన్ని చేస్తారట. మొదటి స్నానం పూర్తి అయిన తరువాత గృహ మధ్య ప్రదేశంలో మొగపిల్లవాణ్ణి కూర్చోపెట్టి మంగళహారతి ఇచ్చి అతనిముందు ఒక దోసపండు నిలుపుతారట! ఆ బాలుడు దోసపండును త్రొక్కి హారతిని కాలితో ఆర్పివేస్తాడట!

దీపావళి రెండవనాటికే దీపావళి అని పేరు. ఇది ఆశ్వయుజ అమావాస్య. "దీపైః నీరాజనాత్ అత్ర సైవ దీపావళీ స్మృత" అని నిర్ణయసింధువు దీని నిర్వచించింది. దీపావళినాడు లక్ష్మీపూజ ప్రధాన విషయము. ఆనాడు పగలు భోజనం చేయకూడదు. ఉపవాసం ఉండాలి. అమావాస్య పితృదినం కావటంవల్ల తర్పణాదికాలు ఉంటవి. మహాలయ అమావాస్యనాడు వచ్చిన పితరులకు ఈ అమావాస్యనాటికి దేవమానంలో ఒక దినం అవుతుంది. వాళ్లు ఈనాడు తిరిగి బంధువులిచ్చే తర్పణాదికాలు పుచ్చుకొని తిరిగి తమ తమ లోకాలకు వెళ్ళిపోతారు. అమావాస్యనాడు మనం పట్టే కాగడాలు, దివిటీలు వారికి దేవలోక మార్గాలుకన్పించవలెననే కోర్కెతో చూపుతున్నాము.

దీపావళి ప్రదోష సమయంలో లక్ష్మీపూజ ఆరంభమౌతుంది. ప్రదోషారంభంలో దీప మాలికలను వెలిగిస్తాము. లక్ష్మి అర్ధనిశా సమయంలో వస్తుంది. అంతవరకూ ఇళ్ళలో ఉన్న ఆ లక్ష్మికి అక్కగారయిన పెద్దమ్మను (అలక్ష్మి) తరిమి వేయటానికి కొన్ని ప్రాంతాలల్లో స్త్రీలు శూర్పాలు (చేటలు) డిండిమాలు మ్రోగిస్తూ గ్రామంచుటూ తిరుగుతారు. దీన్ని అలక్ష్మి నిష్కాసన మంటారు. లక్ష్మి రాకను ఉద్దేశించి మనం దీపావళినాడు దీప మాలికలను వెలిగించి ఆ దేవతను పూజిస్తున్నాము. లక్ష్మీదేవి పూజావిధానాన్ని గురించిన సాంగోపాంగ వర్ణన దేవీ భాగవతంలో కనిపిస్తుంది. దుర్గా సప్తశతిని అనుసరించి లక్ష్మి దుర్గామూర్తి సౌమ్యరూపము ఈ దీపావళి అమావాస్యనాడు అఘోర తాంత్రిక సంప్రదాయజ్ఞులు శ్మశానభూమికి వెళ్ళి అక్కడ తమ మంత్రాలను పునశ్చరణచేసి సిద్ధులు పొందుతారు.

కాళికా పురాణంలో దీపావళి ఉత్సవానికి సంబంధించిన ఒక కథ కనిపిస్తున్నది. రాక్షససంహారానంతరం మహాకాళి హింసోన్మత్తరూపంతో విశృంఖలంగా విహరిస్తున్నది దశదిశలూ ప్రాణికోటుల హాహాకారాలతో దద్దరిల్లి పోతున్నది. పరమేశ్వరుడు ప్రాణిలోకంమీద కరుణవహించి ఉన్మత్తరూపంతో వస్తున్న కాళికాదేవి మార్గంలో నిలచినాడు. క్రోధోన్మత్తకాళి శివుని వక్షస్థలాన్ని ప్రవేశించింది. తపఃపూతమైన శివుని స్పర్శవల్ల కాళి క్రోధం ప్రశాంతించింది. ఆ సందర్భంలో ప్రాణులు దీపోత్సవాలతో శివుని, కాళికను స్తుతించారు ఆనాటినుంచి దీపావళ్యుత్సవాలు ఆరంభించినవని భారతదేశంలో కొన్ని ప్రాంతాల వారి అభిప్రాయం.

దీపావళ్యుత్సవాలు మహామాయ వినాశలీల, సృష్టిక్రీడలను వ్యక్తంచేసే సంజ్ఞాత్మకాలైన పండుగలనేభావం ఉత్తరదేశంలో వుంది ఈ విశేషాన్ని మహాకవి రవీంద్రనాథ ఠాగూరు తన 'విరాట - నదీ' అనే గేయంలో నిరూపించినాడు. దీపావళిఉత్సవాలల్లో లక్ష్మీపూజ చేసినతరువాత విసర్జనోత్సవం లేదు. వంగదేశంలో కొన్ని బన్యా కుటుంబాలు లక్ష్మీదేవికి వలవంటి వస్త్రం ఇస్తారు. అటువంటి వస్త్రాన్ని ధరించటంవల్ల ఆమె సిగ్గుచేత యింట్లోనుంచి బయటికి వెళ్ళదని వారిభావన. వారిఇంట్లో నే వుండి సంవత్సరం పొడుగునా శుభాన్ని చేకూర్చగుస్తుందని వారి ఆలోచన.

లక్ష్మి కాళిరూపాలు రెండు మహామాయ భిన్నమూర్తులు. ఈ అభిప్రాయాన్ని భక్తకవి పోతరాజు లక్ష్మీవర్ణనలో సుందరంగా నిరూపించాడు. లక్ష్మిని మూలవిరాట్ రూపంగా భావించి క్రిందిరీతిగా వర్ణించి ధన్యుడైనాడు:

> భావించి యొకమాటు
> బ్రహ్మాండ మంతయు
> నాట బొమ్మరిల్లని తలంచుఁ
>
> బోలించి యొకమాటు భువనంబు
> లన్నియు
> దన యింటిలో దొంతులని తలంచుఁ
>
> బాటించి యొకమాటు బ్రహ్మాది
> సురులను
> దన యింటిలో బొమ్మలని తలంచుఁ
>
> గొనకొని యొకమాటు కుంభినీ
> చక్రంబు
> వలవడ బొమ్మపీటని తలంచు
>
> సొలసి యొకమాటు సూర్యేంగు
> రోచుల
> వచటి దీపకళిక లని తలంచు
>
> భామ యొకమాటు భారతీగుర్గల
> నాత్మ సఖులటంచు నాదరించు"

లక్ష్మీశబ్దానికి 'లక్ష్' 'రిక్ష్' ధాతువులతో సంబంధం వీటికి 'చూచు' 'రక్షించు' అని అర్థాలు 'లక్ష్యతే సర్వోఽ నయేతి లక్ష్మీః — ఈమెచేత సర్వము చూడబడును గావున లక్ష్మి.

దీపావళి అమావాస్యనాడు 'అలక్ష్మి నిష్కాసనము' - (దరిద్రదేవతను వెళ్లగొట్టటము) - ఒక ఆచారంగా చేస్తున్నాము. ఈ అలక్ష్మీవర్ణనలు మన సాహిత్యంలో కనిపిస్తున్నవి అలక్ష్మి లక్ష్మికిపూర్వం సముద్రమథనసమయంలో పాలసంద్రంలో పుట్టింది. పురాణాలల్లో అలక్ష్మిని క్రింది రీతిగా మన ఋషులు వర్ణించారు; ఆమెను ఇలా ప్రార్థించాలని నిరూపించారు.

> "అలక్ష్మీస్త్వాం కురూపాసి కుత్సిత
> స్థానవాసినీ
> సుఖరాత్రౌ మయాదత్తాం గృహాణ
> పూజాంచ శాశ్వతీ॥
> దారిద్ర్య కలహప్రియే దేవి త్వం
> ధననాశని
> యాహిశత్రోర్గృహే నిత్యం స్థిరా
> తత్ర భవిష్యసి॥
> గచ్ఛత్వంమందిరంశత్రోర్గృహీ
> త్వా చా శుభంమమ
> మ దాశ్రయం పరిత్యజ్య స్థితాత్ర
> భవిష్యసి॥"

అలక్ష్మిని కృష్ణవర్ణ, ద్విభుజ, కృష్ణవస్త్ర పరిధాన, లోహాభరణభూషిత, గృహసమ్మార్జనీహస్త, గర్దభారూఢను గా వర్ణించి భారతీయులు దీపావళి సందర్భంలో ఆమెను తమ యిళ్ళనుండి శత్రువులయింటికి తరిమివేస్తారు. అమావాస్యనాడు వంగదేశంలో కాయస్థులు బ్రాహ్మణులు పేడతో అలక్ష్మీ రూపాన్ని పాతచేటలో ఒక ప్రతిమగా నిల్పి కేశఖండాలతోనూ, నల్లని పూసలతోనూ పూజించి ఇంటికి దూరంగా పారవేస్తారు అప్పుడు చేటను అలక్ష్మికి ప్రియమైన సంగీతంగా మోగిస్తారు. ఈ విసర్జనసమయంలో పురోహితుడు కొన్ని వేదమంత్రాలు పురాణ శ్లోకాలు చదువుతాడు. ఆ సందర్భంలో వినిపించే వేదమంత్రాల్లో క్రింది మంత్రం ప్రసిద్ధమైంది.

"ప్రపతేతః పాపి లక్ష్మి నశ్యేతః ప్రాముతః పత। అయస్మయేనాం కేన ద్విష తేత్వా సజామసి। ఏకశతం లక్ష్మ్యో మర్త్యస్య సాకం తన్వా జను షోధి జాతాః॥" [ఓ పాపిలక్ష్మి! ఇవీ అవీ వదలి వెళ్లిపో. ఇనుప బంధాలతో నిన్ను మా శత్రువులకు బంధిస్తాము. మానవశరీరం వల్ల నూరుమంది లక్ష్ములు ఉద్భవిస్తారు వీరిలో అశుభలందరినీ మేముతరిమివేస్తాము.] ఈ అలక్ష్మి నిష్క్రాసనము అయిన తరువాత పురోహితుడు వచ్చి కాళ్లు చేతులు కడుగుకొని ఇంట్లో ప్రవేశించి లక్ష్మిపూజ ఆరంభిస్తాడు. శ్రీసూక్తాదుల చేత ఆమెను తృప్తి పొందిస్తాడు. కఠినమైన ఘంటికానాదాలను లక్ష్మి వినజాలదు కావున మృదువైన శంఖ ధ్వానం చేస్తాడు. మహారాజులయింట లక్ష్మి పూజాసమయంలో 'గజోప బృంహితాలు' వినిపిస్తారు లక్ష్మికి ఏనుగుల ఘీంకారమంటే మహాయిష్టం. ఆమెను గూర్చి శ్రీసూక్తం "హస్తినాద ప్రబోధనీం" అనిపలుకుతున్నది. నిత్యలక్ష్మిని కోరి భారతీయులు ఈ అమావాస్యనాడు దీపవృక్షదానం చేస్తారు.

దీపావళిపండుగ నాల్గవనాడు కార్తీక శుద్ధ ప్రతిపత్తు. ఈనాడు పగలు గోక్రీడ, గోవర్ధనోద్ధరణ పూజ– ద్యూతక్రీడ జరిగించడం ఆచారం. రాత్రి బలిపూజ జరుగుతుంది. అపరాహ్న సమయంలో 'మార్గపాలిక'కు సంబంధించిన ఉత్సవం జరిపించాలి.

ఇందులో గోపూజ సాంకేతికంగా నిల్చిన సూర్యకిరణ పూజగా మనం భావించవచ్చు. 'గో' శబ్దానికి కిరణమనే అర్థం వైదిక సంప్రదాయంలో సుప్రసిద్ధంగా ఉన్నది. గోపూజ విషయంలో నిర్ణయసింధువు మొదలైన ధర్మ గ్రంథాలలో ఒక నియమం కనిపిస్తున్నది. అది చంద్రదర్శనం కాని ప్రతిపత్తులో జరగాలట. అంటే ఆ ప్రతిపత్తు నాడు చంద్ర దర్శనం కారాదు. ఒక వేళ ద్వితీయ (విదియ) వచ్చేటట్లుంటే ఈ గోక్రీడోత్సవాన్ని కూడా క్రితంనాడు (అమావాస్యనాడే) జరిపించాలన్నమాట. చంద్ర దర్శనం కారాదన్న నియమానికి గోవులు దిక్పత్వచిహ్నాలై ఉండటమూ, చంద్రుడు పితృసంబంధి కావటం కారణమై ఉంటుంది. ధర్మశాస్త్రాలు "చంద్రదర్శనం అయిన కార్తీక శుద్ధ ప్రతిపత్తునాడు గోపూజ చేస్తే చంద్రుడు గోవులను చంపుతాడు" అని సాంకేతిక భాషలో ఒక మహార్థాన్ని నిరూపణ చేసినవి.

గోవర్ధన పూజ దీపావళ్యుత్సవాలల్లో ప్రతిపత్తినాటి విశేషాల్లో తరువాతిది. కృష్ణ జన్మకు పూర్వం గోకులంలో దీపావళి సందర్భంలో లోకాలకు లోకపాలకులకు ప్రభువైన ఇంద్రుడు 'దివినుండి ధారాళ వారి గురిసి సస్యముల ప్రోచి పసికి పోషణ మొనర్చి యఖిల జంతు తతులకుఁ బ్రీతి నావహింపఁజేసే ఇంద్రపూజ జరిగేదట! కృష్ణుడు గోపకులు 'ఇంద్రపూజ' తలపెట్టినపుడు వారితో

"మంత్ర యజ్ఞులు విప్రులు
మహిత సీర
యజ్ఞులగుదు కృషీవలు లద్రియజ్ఞ
లనఘ గోపాలు రటుగాన
యచల పూజ
యుత్సవంబుగాఁ జేయుట యొప్పు
మనకు"

అని చెప్పి వారిచేత గోవర్ధనగిరిపూజ చేయించినాడు. ఇంద్రునికి కోపం వచ్చి శిలావర్షం కురిపించాడు. కృష్ణుడు తన చిటికెన వ్రేలుమీద గోవర్ధనాన్ని ఎత్తి గోగోపకుల రక్షించాడు. ఆకాలంనుంచి గోకులంలో ఇంద్రపూజ లేదు గోవర్ధన పూజ ఆచారమైంది. ఈ గోవర్ధనోద్ధరణకు సంకేతంగా

# దీపావళి మహాత్మ్యాలు

పిండితో గోవర్ధన పర్వతాన్ని నిర్మించి దాన్ని దీపమాలికలతో వెలిగించి కృష్ణపూజ చెయ్యటం కార్తీక శుద్ధ ప్రతిపత్తినాడు ఆచారంగా ఉన్నది. దీనిని గోకులంలో శనేకు 'అన్-కాట్' అంటారు.

పిమ్మట ఈ ప్రతిపత్తినాడు జరగవలసిన ఆచారం ద్యూతము. ఉదయవేళ యీ ఉత్సవం జరగాలి. ఈ ప్రతిపత్తుకు 'సుఖరాత్రి' అన్న పేరు ఉంది. సుఖరాత్రి పండుగ విశేషాలను చెపుతూ ఆదిత్యపురాణం జూదాన్ని ఒక లక్షణంగా చెప్పింది. అందులో క్రింది శ్లోకం కనిపిస్తున్నది.

"స్నిగ్ధై ర్ముగ్ధై ర్విదగ్ధైశ్చ బాంధవై
ర్నిబృతై సహ
శంకరస్తు పురాద్యూతం ససర్జ
సుమనోహరమ్.
కార్తికే శుక్లపక్షాతు ప్రథమేఽహని
సత్యవత్
జితశ్చ శంకర స్తత్ర జయలోకాచ
పార్వతీ"

ఈ కార్తీక శుద్ధపాడ్యమినాడు పూర్వం పార్వతి శంకరునితో కూడి జూదమాడి జయాన్ని పొందిందట! ఈ శంకర పార్వతీ ద్యూతక్రీడ క్రీ.శ. 757—772 మధ్య కాలంలో పాలించిన రాష్ట్రకూట కృష్ణరాజు పాలనలో మలచిన ఎల్లోరా కైలాస నాథాలయంలోని గుహల్లో సుందర శిల్పరూపాన్ని పొందింది. ఈ పార్వతీ పరమేశ్వరుల ద్యూతక్రీడకు సంకేతంగా నేడు కార్తీక శుద్ధ ప్రతిపత్తునాడు ద్యూతక్రీడ ఆచారమైనది. ఈనాడు జూదంలో గెలిచిన వాళ్లకు సంవత్సరం పొడుగునా విజయం కలుగుతుందన్న నమ్మకం భారతదేశంలో కొన్నికొన్ని ప్రాంతాలవారికి గాఢంగా ఉంది. ఈ ద్యూతక్రీడానంతరం భార్యాభర్తలు దీపమాలికల మధ్య సుఖశయనులు కావలెనన్న హేమాద్రి అనుశాసనం గమనింపతగ్గది. రాత్రింబవళ్లు నిత్యం జూదములు ఉంటవని భారతాదుల్లో చెప్పిన కథకూ దీనికీ సంబంధాన్ని మనం ఊహించవచ్చు. ఈ ద్యూతంకూడా కాలంలో మార్పును సూచించటం విశదంగా ఆలోచిస్తే మనకు గోచరిస్తుంది.

కార్తీక శుద్ధప్రతిపత్తునాడు అపరాహ్ణ సమయంలో జరగవలసిన కలాపం 'మార్గపాలిని' కుశ కాశాదులను ఒక కట్టకట్టి ఎత్తైన చెట్టుకుగానీ, స్తంభానికిగాని కట్టి దానిక్రిందుగా వెళ్లటం దీనిముఖ్యలక్షణం. ఈమార్గపాలినికి హోమాదిపూజలు చెయ్యవలెనని చెప్పిఉంది. ఈ ఆచారం చాతుర్వర్ణ్యం అనుసరించాలి. ఈ మార్గపాలినిని పాటించిన రాష్ట్రానికి జయం లభిస్తుందట! వ్యక్తులు దీనిక్రిందిగా దాటివెళ్లినవాళ్లకు రోగభయం శంకాభయం తొలుగుతవని ధర్మశాస్త్ర గ్రంధాలు చెప్పుతున్నవి. ఈ ఆచారం ఆంధ్రదేశంలో కనిపించదు. వెనక మహారాజులు రాజ్యంచేసిన కాలంలో తప్పక ఉండి ఉంటుంది.

'బలిపూజ' ఈ కార్తీక శుద్ధ ప్రతిపత్తునాటిరాత్రి జరుగుతుంది. బలిముల్లోకాలను జయించి అసుర సామ్రాజ్యాన్ని వ్యాప్తి నొందించాడు. దేవతలు విష్ణుమూర్తికి తమ ఇక్కట్లు నివేదించుకోగా ఆయన వామనావతారం ధరించి 'మూడడుగుల నేల దానమడిగి త్రివిక్రముడై బలిని పాతాళానికి త్రొక్కివేశాడు. ఆసమయంలో విష్ణుమూర్తి బలికి పాతాళాధిపత్యం ఇస్తూ ప్రతి సంవత్సరం ఒకమారు భూలోకానికి వచ్చి మానవుల పూజలందుకొనేటట్లు అనుగ్రహించాడట. అందువల్ల బలి ప్రతిసంవత్సరం కార్తీక శుద్ధపాడ్యమినాడు భూలోకానికి వస్తాడు. మానవులు దీపమాలికలతో ఆయన్ను ఆహ్వానిస్తారు. ఇదికూడ సూర్యదేవుని గమనానికి సంబంధించిన కథగానే కనిపిస్తున్నది. మహారాష్ట్ర స్త్రీలు ఈసందర్భంలో గోమయంతోగానీ పిండితోగాని బలి బొమ్మను చేసి దీపధూపాదికాలతో పూజించి నేడుకూడ మంచిపాటలు పాడుతారు. పంచవర్ణాలతో కూడిన శాలితండులాలతో గృహమధ్యంలో ఉన్న వేదికమీదకు బలిని ఆహ్వానించి "బలిరాజ నమస్తుభ్యం దైత్యదానవ వందిత ఇంద్ర శత్రో ఽమరారాతే విష్ణుసాన్నిధ్య ఽదో భవ" అనే శ్లోకంతో ధ్యానించవలసిందని ధర్మశాస్త్ర గ్రంధం చెప్పుతున్నది. సంప్రదాయజ్ఞులు ఈబలిపూజ కేవలం క్షత్రియులు చేయవలసిన కర్మకలాపంలా భావిస్తున్నారు.

దీపావళి పండుగల్లో అయిదవనాటికి యమద్వితీయ అని పేరు. ఈనాడు యముడు తన చెల్లెలైన యమునను చేరి ఆమె ఆతిథ్యాన్ని పొందినాడట! అందువల్ల అతని సర్వదారిద్ర్యాలు నశించినవట! అందుచేత ఆనాడు 'భగినీ హస్తభోజనం' ఆచారంగా ధర్మశాస్త్రవేత్తలు భారతీయులకు నిర్ణయించారు. యమద్వితీయనాడు యమునలో స్నానంచేసి తర్పణం విడిస్తే వాడికిపాపాలు లేవని నిర్ణయసింధువు మొదలైన ధర్మశాస్త్ర గ్రంధాలు పలుకుతున్నవి. ఈసమయంలో అక్కచెల్లెండ్లకు కానుకలు ఇవ్వటం ఆచారం. యముడు బ్రహ్మవేత్త. కఠోపనిషత్తులో ఈధర్మరాజు నచికేతునకు బ్రహ్మస్వరూపాన్ని ఉపదేశించినట్లు నిరూపిత

# దీపావళీ మహాత్మ్యాలు

మైంది. కృష్ణభగవానుడు గీతలో తన స్వరూపాన్ని వివరిస్తూ "పితౄణా మర్యమా చాస్మి యమః సంయమతా మహమ్" (పితరులలో నేను సూర్యుడను, శాసకులలో యముణ్ణి) అని చెప్పినాడు. యమ సంబంధమైన నక్షత్రాలతో నే దీపావళి ఆరంభిస్తున్నది. అందువల్ల కొందరు దీపావళ్యుత్సవాలను ప్రధానంగా యమపూజోత్సవాలుగా భావించటం కనిపిస్తున్నది. మహారాష్ట్రులకు ప్రధానంగా దీపావళి యమపూజోత్సవాలు.

భారతీయులు దీపావళి నాటిని పరమ పవిత్రంగా భావిస్తారు. గృహాలను అలంకరించి, పండుగలకు అల్లుళ్లను పిలుచుకొని వస్తారు. ఆనాడే చిన్న పిల్లలకు విద్యారంభం చేయిస్తారు. నూతన వ్యాపారాలు ప్రారంభిస్తారు. పితృ దినాలుగా భావించి శిష్టులు తిల తర్పణాలు వదలి దాన ధర్మాలు చేస్తారు. బహుకాలంనుంచీ భారతీయులు ఈ పండుగలను ఇలా జరుపుకుంటున్నారు. అక్బరు చక్రవర్తివంటి మహమ్మదీయ రాజన్యులు కూడా వీటిలో పాల్గొన్నట్లు చారిత్రక నిదర్శనాలు కనిపిస్తున్నవి. దీపావళి పండుగల్లో నేడు కాలుస్తున్న మందు సామాగ్రి బాబరు కాలంనుంచి దేశంలో ప్రవేశించింది. అంతకు ముందు దీప మాలికలు వెలిగించటం దివిటీలు త్రిప్పటం ఆచారం.

మహమ్మదు గజనీవెంట భారత దేశానికి వచ్చిన అల్బెరూని పండితుడు దీపావళినాటి భారతీయుల ఆచారాలను గురించి కొంత వ్రాసి దానికి కారణాన్ని గురించి తాను విన్నది ఇలా చెప్పినాడు.

"The cause of this festival is that Lakshmi, the wife of Vasudeva, once a year on this day Liberates BALI, the son of Virochana who is a prisoner in the seventh earth, and allows him to go out into the world. Therefore the festival is called BALIRAJYA—the principality of Bali. The Hindus maintain that this time was a time of luck in the Kritayuga, and they are happy because the feast in question resembles that time in the Kritayuga" — Alberuni's India Vol II—P. 182.

భారత దేశంలో ఏ ప్రాంతాన్ని చూచినా రమ్యాలంకరణలతో రంగవల్లికలతో యీ దీపావళ్యుత్సవకాలంలో కళకళ లాడుతూ ఉంటుంది. ఈ అంశాన్నే ఒక కవి శేఖరుడు ఇలా వర్ణించాడు.

"వెలిగించుచుందురు విమలార్య మానినీ
తిలకంబు లెల్లెడ దీపరాజి,
పట్టించుచుందురు ప్రమదామణుల్ నిజ
సుతులచే దివటీలు పతులు చూడ
ప్రేలించుచుందురు వివిధంబులౌ బాణ
సంచాలు బాలురు సంభ్రమమున
కట్టించుచుందురు కమనీయ వస్త్రముల్
క్రొత్త యల్లుండ్రచే నత్తమామ
లాత్రపడుచుందు రెల్ల రారాత్రమంచు
పరమ తేజోమయంబగు ప్రకృతిజూడ
భారతీభాగ్యరేఖా ప్రభావ మిటుల
వెలుగ నననోచు దీపావళి విధము
గనగ"

# హెడ్ మాస్టరు

మునిమాణిక్యం నరసింహారావు

తెలుగులో ప్రధానోపాధ్యాయుడు అనబడే వ్యక్తినే అందరూ హెడ్‌మాస్టరు అంటారు. సృష్టిలో ఈ ప్రధానోపాధ్యాయుని స్థానం ముందుగా నిర్ణయించవలసి ఉన్నది. సృష్టి జడము అజడము అని ద్వివిధము. అజడజగత్తును జంతువులు, జంతువులు కానివి, (Animals and non-animals) అని రెండు విభాగాలు చేయవచ్చును.

జంతువులలో మనుష్యులూ, మనుష్యులు కానివి, అని రెండు విభాగా లున్నవి.

ఆ మనుష్యవర్గములో ఉపాధ్యాయులు ఉపాధ్యాయేతరులు అన్న విభాగాలు కూడా ఉన్నవి. కార్మికులు, కర్షకులు, వర్తకులు, గుమాస్తాలు మొదలైనవారు అంతా ఉపాధ్యాయేతరులు అనబడే విభాగంలోకి వస్తారు.

మళ్లీ ఉపాధ్యాయులు అనబడే సమూహాన్ని తీసుకొని, దానిని ప్రధానోపాధ్యాయులు సహోపాధ్యాయులు అనబడే వర్గాలుగా విభాగంచేస్తే, సృష్టిలో ప్రధానోపాధ్యాయుని స్థానం విశదము అవుతుంది.

అంటే తర్క రీత్యా, జంతు రాజ్యంలో (Animal Kingdom) ఒకరకము మనిషిని ప్రధానోపాధ్యాయుడు అంటారు.

ప్రధానోపాధ్యాయుడు మనిషి అని నిర్ణయం కుదరడముతోనే, కొన్ని ఉప నిర్ణయాలు (immediate inferences) తత్క్షణం చేయడము సాధ్యము అవుతుంది.

అవి ఏవి అంటే, ప్రధానోపాధ్యాయునికి కూడా ముక్కు, నోరూ, చేతులూ, కాళ్ళూ మొదలైన అవయవాలు ఉంటాయనీ, మానవజాతికి సహజమైన ఈర్ష్య, అసూయ, కోపమూ, లోభమూ, మదమూ, మాత్సర్యమూ మొదలయిన గుణాలు ఉంటవి అనీ చెప్పవచ్చును.

ఇవన్నీ ఎందుకూ, ఏమంత గొప్ప విషయాలు అని అనుకోవచ్చు ఎవరైనా. నాకూ తెలుసు ఇవి గొప్పవిషయాలు కావని. కాని ఒక పదార్థముయొక్క తత్వ స్వరూపములను నిర్ణయించేటప్పుడు తర్కరీత్యా క్రమానుగుణ్యంగా జరగవలెను. కాబట్టి నేను ఇవన్నీ చెబుతున్నాను.

"ఇమ్మీడియట్ ఇన్‌ఫరెన్సు అయిపోయిన తర్వాత మీడియేట్ ఇన్‌ఫరెన్సువలన ప్రధానోపాధ్యాయుడు అనే పదార్థాన్ని గురించి మనము తెలుసుకోదగినది ఏమిటి అన్నది రెండవ విషయము.

ప్రధానోపాధ్యాయుడు మనుష్యుడు. మనుష్యులందరికీ చావు ఉన్నది. కాబట్టి హెడ్ మాస్టర్లకుకూడా చావు ఉన్నది.

ఆసంగతి ఎవరికి తెలియదు అని అనటము తర్కశాస్త్ర విధానాన్ని తిరస్కరించడమే అవుతుంది. అరిస్టోటిల్ అంతవాడు సిలోజిజమ్ అనే వాద విశేషాన్ని సృష్టించి సోక్రటీసు మనుష్యుడు కాబట్టి ఆయనకుకూడా మరణము ఉంది అని నిరూపించినాడు. కాబట్టి నేను ప్రధానోపాధ్యాయునికి మరణం ఉన్నదని చెప్పడంలో వైపరీత్యము ఏమీ లేదు అని అంటున్నాను. మానవులలో చాలమందికి పునర్జన్మ ఉంటుంది కాబట్టి హెడ్‌మాస్టరు అయినవానికికూడా పునర్జన్మ ఉంటుంది అనవచ్చును. హెడ్‌మాస్టరు మళ్లీ హెడ్‌మాస్టరుగానే పుడతాడు అని జగన్నాథ భట్టాచార్యుని మతము. అయితే మనుష్యులలో ప్రధానోపాధ్యాయుడు కారణ పురుషుడు అనీ, అట్టివానికి పునర్జన్మ ఉండదనీ వంగదేశములో నైయాయిక రత్నత్రయములో ఒకడు అయిన గంగాధర భట్టాచార్యుడు అంటాడు. కాని దానితో మనకిప్పుడు ప్రమేయంలేదు.

ఇంతవరకు తర్క వేదాంత శాస్త్రముల దృష్టిలో ప్రధానోపాధ్యాయుని ఉనికిని గూర్చి చర్చించినాను.

ఇక చారిత్రకంగా చూద్దాము. పూర్వ భారత కాలంనాటికి ప్రధానోపాధ్యాయులు ఉన్నట్లు కనబడదు. ఆచార్య పదం ఎక్కువగా కనిపిస్తుంది. ఆచార్యుడే ఉపాధ్యాయుడు. కృపాచార్యుడు, ద్రోణాచార్యుడు, భీష్మాచార్యుడు మొదలైనవారు ఉపాధ్యాయులే అయి ఉంటారుగాని ప్రధానోపాధ్యాయులు అయి ఉండరు.

ఉపాధ్యాయులలో భేదప్రభేదాలు బౌద్ధయుగంలో వచ్చి, దానితరువాత బ్రిటిష్ యుగంలో స్థిరపడిపోయినవి.

ప్రధానోపాధ్యాయుడు అంటే ఉపాధ్యాయులందరిపై అధికారి. రాజాలలో ధర్మరాజువలెనూ, పర్వతాలలో హిమాలయమువలెనూ, వృక్షాలలో వటవృక్షం సంపెంగ వలెనూ, మాష్టర్లలో హెడ్‌మాస్టరు రాణిస్తూ ఉంటాడు.

ఆయన కనుసన్నలలో మెలగుతూ ఆయన ఆజ్ఞలను పాటిస్తూ ఉండేవారు సహోపాధ్యాయులు అవుతారు.

సహోపాధ్యాయులు హెడ్ మాస్టరు ఎడల వినయ విధేయతలు ప్రదర్శిస్తూ, ఎల్ల

# ★ హెడ్‌మాస్టరు ★

ప్పుడూ కూడా ప్రణత శిరస్కులై ఉంటూ ఉంటారు.

పాఠశాల ఆవరణలో వారి కీర్తి వ్యాపించి ఉంటుంది. ఆ కీర్తి శరత్కాలపు వెన్నెల వలె ధవళమై నిర్మలమై ఉంటుంది.

పాఠశాల నిర్వహణ భారమంతా వారి భుజస్కంధములపై ఉంటుంది. సిమెంటు కుడ్య పరీవృతమైన ఆ పాఠశాల ఆవరణే ఆయన సామ్రాజ్యము. ఆ సామ్రాజ్యములో శ్రీవారి మాట అనుల్లంఘనీయమైన శాసనము. వారు అచ్చట దుశ్శాసనులు. దుష్కరమైన శాసనములు కలవారు దుశ్శాసనులు అని అర్థము. ఆ పాఠశాలలో ఆ ప్రధానోపాధ్యాయ సర్వేశ్వరుడు శిఖరములయందు కూడుకొన్న చంద్రమండలము కల మేరుపర్వతము వలె భాసిస్తూ ఉంటాడు.

శ్రీ వారు ఎల్లప్పుడూ ధౌతవస్త్రములనే ధరిస్తూ ఉంటారు కాబట్టి మేరుపర్వత సాదృశ్యమును చెప్పవలసి వచ్చింది. వారి శిరోవేష్టమును చంద్రమండలముతో పోల్చుడము కూడా ఉచితంగానే ఉన్నది.

చక్రవర్తులకు వంది మాగధులు ఉన్నట్లుగానే ప్రధానోపాధ్యాయులవారికి కూడా వందిగణము ఉంటుంది.

శ్రీ వారు కృపాసముద్రులనీ, పాఠశాల పరిపాలనా నిర్వహణ కార్యమునందు అతి సమర్థులనీ, సాధువర్తనులనీ, ధర్మానురక్తులనీ స్తోత్ర పాఠాలు వల్లిస్తూ ఉంటారు ఈ వంది జనులు. సహోపాధ్యాయులే కొందరు వంది జనము అవుతారు.

ప్రధానోపాధ్యాయులు పాఠశాలలో దుర్నిరీక్షులై వైరివీర భయంకరులై ఉంటూ ఉన్నా తదితర ప్రదేశములయందు వారు గంగగోవువలె సాధువులును, గొర్రె వలె అమాయకులును అయిఉంటారని ప్రతీతి (A lamb at home and a lion at School)

డాక్టరు ఆర్నాల్డు అనే ఆయన ఇంగ్లండు దేశంలో ప్రసిద్ధుడైన హెడ్‌మాస్టరు.

ఇంగ్లండు దేశపు ప్రభువైన మూడవ జార్జి ఒకసారి ఆర్నాల్డు పాలిస్తూ ఉన్న పాఠశాలను చూడటానికి వచ్చినాడు. ఆర్నాల్డు, ప్రభువుకు పాఠశాలయొక్క వివిధ భాగాలు చూపునప్పుడు తానుముందు నడిచి, ప్రభువు తనవెనుకగ వచ్చేలాగున చేసినాడట! అంతేకాక తనశిరస్సుపైనున్న టోపీని (Hat) తీయలేదట! ఇల్లాగ చేయడము ప్రభువును అగౌరవపరచుటే అవుతుంది. అయినా అట్లాగే చేశాడు.

అటుతరువాత ప్రభువువారిని తనగదిలోకి తీసికెళ్ళి, వినయంగా నమస్కరించి "నేను నాటోపీ తీయకుండా మీముందు నడవడం కూడనిపని అని నాకు తెలియకపోలేదు. కాని బాలురు నన్ను సర్వాధికారివలె చూస్తున్నారు. నాకంటే పైఅధికారి ఒకరు ఉన్నారని వాళ్ళకు తెలిస్తే నాకు అపకర వస్తుంది. అందుకని ఆ విధంగా ప్రవర్తించాను. క్షమించు ప్రభు" అని వేడుకొన్నాడట!

హెడ్‌మాస్టరు అయినవాడి చిత్తవృత్తి అల్లాగ ఉంటుంది.

అల్లాంటి హెడ్‌మాస్టర్లు పూర్వం వుండేవారు. వారియెడల విద్యార్థులూ, ఇతర జనమూ కూడా భక్తిప్రపత్తులతోనూ వినయవిధేయతలతోనూ మెలగుతూ వుండేవారు.

హెడ్‌మాస్టరు వస్తున్నారు అంటే ప్రతాపరుద్రుడు వస్తూవుంటే శత్రుమూకలు భయభ్రాంతులై ఏవిధంగా చెల్లాచెదరై పోయేవారో అల్లాగే విద్యార్థులు భయపడి నలుదిక్కులకూ పారిపోయేవారట!

పాఠశాలను పరీక్షించడానికి వచ్చిన ఒకానొక అధికారి ఒక కుఱ్ఱవాడిని అడిగినాడట, మాస్టరుకూ, హెడ్‌మాస్టరుకూ భేదం ఏమిటి అని.

ఆ బాలుడు ఒకనిమిషం ఆలోచించి, గంట కొట్టడముతోనే క్లాసులోకి పోయే

#  హెడ్ మాస్టరు 

...వాడు మాస్టరు. బెత్తంపట్టుకొని వరాండాలో తిరిగేవాడు హెడ్‌మాస్టరు అని జవాబు చెప్పినాడు.

తలకాయ ఉన్నవాడు హెడ్‌మాస్టరు అనీ, తలకాయలేనివాళ్లు పట్టిమాస్టర్లనీ తికనిర్వచనం కూడా ఉన్నది.

ఈ హెడ్‌మాస్టరు అనబడేవారు స్కూలు వరాండాలో తిరుగుతూ ఉంటే పులకల సముదాయముయొక్క సమున్నతత్వమూ, సముద్రాకలయిత గాంభీర్యము, వారిలో గోచరిస్తవి. బాలబాలికలు అందరూ భీతచేతస్కులయి, ఉచితస్థానములలో నిశ్చేష్టులై కాష్ఠాకృతిని పొందుతారు. వారి చేతిలోని బెత్తమును చూచి, వారి కంటి ఎఱుపుజూచి కంపమును పొందని బాలుడు ఉండడు.

ప్రధానోపాధ్యాయులకు సింహతలాటపు కంకణములూ, భుజకీర్తులూ ఉంటే బాగుంటుందని ఈమధ్య ఎవరో ఒక ఉపాధ్యాయుల సభావేశంలో ప్రతిపాదించారు.

అదే సమయంలో విద్యార్థి సభావేశంలో ఒకరు ప్రధానోపాధ్యాయుడు, కాళ్ళకు పెద్దగా ధ్వనించేటువంటి కంచుగజ్జెలను ధరించాలనీ, వారిచే ఆ పని చేయించుట విద్యార్థుల ప్రథమ కర్తవ్యమనీ, ఈ పని జరుపుటకు విద్యార్థులు ఎంత త్యాగమైనా చేయుటకు సిద్ధంగా ఉన్నారని గంభీరమైన ఉపన్యాసం ఇచ్చినాడు.

కవులు కాళ్ళకు గండపెండేరము ధరించిన విధంగానే ప్రధానోపాధ్యాయులు ఈ గంటు గజ్జెలను ధరించవలయునని వారివాదన.

హెడ్‌మాస్టరును గురించి ఇంకా ఒక్క విషయం ఉన్నది చెప్పవలసింది.

ఒక్కొక్కరిని జూచి కొందరు "ఈ ముఖానికేనా హెడ్‌మాస్టరు గిరీ" అంటూ ఉంటారు. "నీముఖానికి తోడు హెడ్ మాస్టరు గిరీ కూడానా" అనీ, ఇది "హెడ్ మాస్టరు చేసే ముఖంకాదనీ" ఒక్కొక్కరు ఒక్కొక్కరి విషయంలో అంటూ ఉంటారు.

నన్నే అన్నారు నా మిత్రులు, "నీది హెడ్‌మాస్టరు ముఖంకాదు" అని.

దీనినిబట్టి ముఖాలలో హెడ్‌మాస్టరు ముఖం అంటూ ఒక రకం ముఖం ఉంటుంది అని స్పష్టంగా తెలుస్తున్నది.

సాముద్రిక శాస్త్రం చూచినా ఈ రకం ముఖాల లక్షణాలు ఎల్లాంటివి అయిఉంటవో నాకు తెలియలేదు.

వాడి ముఖంలో రాజకళ ఉన్నదనీ అన డము మనము తరుచుగా వింటూ ఉంటాము. అల్లాగే హెడ్‌మాస్టరు కళ అని ఒక రకం కళ ఉండి తీరాలి.

హెడ్‌మాస్టరు మాటలలో కూడా ఏదో విశిష్టత ఉండి ఉంటుంది. ఎందుకూ అంటే ఇద్దరు విద్యార్థులు పోట్లాడుకుంటూ ఉన్న సమయంలో అందులో ఒకడు, "ఏమి టోయ్, ఏదో హెడ్‌మాస్టరులాగ మాట్లాడు తావేం!" అనడము విన్నాను. దీనినిబట్టి గ్రహించాను హెడ్‌మాస్టరు మాటలలో కూడా ఏదో గుర్తింపతగిన ప్రత్యేకత ఉన్నదీ అని.

హెడ్‌మాస్టరు పదవి ఎంతో వాంఛనీయ మైనదిగా ప్రజలు అనుకొంటారు. ఆ పేరు యందు కూడా జనులకు ఎంతో అనురక్తి ఉన్నది

తల్లి తన కుమారుని భవిష్యత్తును గూర్చి కనే కలలలో, వాడు హెడ్‌మాస్టరు అవు తాడు అన్నది ఒకటి. "మా తండ్రి పెద్ద అయిన తరువాత హెడ్‌మాస్టరు కొడతా" అని అందరిలోనూ చెప్పుకొని సంతోషి స్తుంది తల్లి.

తల్లి పిల్లవాణ్ణి ముద్దుపెట్టుకోవడముకూడా అంతే. పసివాణ్ణి ఎగరేసి ముద్దెట్టుకుంటూ "నా తండ్రే! మా నాయనే! మా హెడ్ మాస్టరే!" అంటుంది.

ఒక కుఱ్ఱవాడికి పిల్లను ఇద్దామని వచ్చిన వాళ్లు, ఆ చిన్నవాడి బంధువులను అడి గారు, "ఏమండీ, ఆ అబ్బాయి ఎటా ఉంటాడూ" అని. వాళ్లు "ఆ అబ్బాయి క్షేమండి. నిక్షేపంలాగుంటాడు. వెనకాల నుంచి చూస్తే అచ్చంగా హెడ్‌మాస్టరులా గుంటాడు" అని చెపుతారు.

ఆ మాటయందు ప్రజలకు అంత ప్రీతి ఉన్నదీ అని చెప్పడానికి పై విషయాలు చెప్పినాను.

ప్రతి పాఠశాలలోనూ ఉండే హెడ్ మాస్టరును గురించి ఇంతవరకు చెప్పినాను. ఇక చిన్న హెడ్‌మాస్టరును గురించి ఒక ముక్క వ్రాసి ఈ వ్యాసం ముగిస్తాను.

చిన్న హెడ్‌మాస్టరు అను వ్యక్తి హెడ్ మాస్టరును అనుసరించి ఉంటాడు. ఈ వ్యక్తి ఒక ఛాయాగ్రహము వంటివాడు ప్రత్యేక వ్యక్తిత్వము ఏమీ లేక హెడ్‌మాస్టరును ఛాయవలె అనుసరిస్తూ ఉంటాడు.

భూమి తన చుట్టూ తాను తిరుగుతూ సూర్యుని చుట్టూ తిరుగుతుంది. ఈ చిన్న హెడ్‌మాస్టరుకూడా తనచుట్టూ తాను తిరు గుతూ పెద్ద హెడ్‌మాస్టరు చుట్టూ తిరు గుతూ ఉంటాడు.

నాయకుడికి, విదూషకుడు ఎంత అవ సరమో, నాయికకు సూతి ఎంత అవసరమో, హెడ్‌మాస్టరుకు చిన్న హెడ్మాస్టరు అంత అవసరము. ★





# రైలు ప్రమాదం

## వంతుల శ్రీరామశాస్త్రి



'దరిద్రుడు తల కడగబోతే వడగళ్ళవాన' అన్నట్టు ముప్ఫైయిఅయిదేళ్ళ వయస్సుకి మొదటిమారుగా పెళ్లిచేసుకొందికి అంగీకరించి, పెళ్లికూతుర్ని చూసుకొందికని పార్వతీశం బయలుదేరేసరికల్లా దారిలో ఏదో రైలు ప్రమాదంవలన వెళ్ళవలసిన చోటికి వెళ్ళడం కాలేదు. ఇంకా స్పష్టంగా చెప్పాలంటే అతను ఉంటున్నది మద్రాసులో; వెళ్లదలచినది బరంపురం—మద్రాసులో ఉద్యోగం, ఒరిస్సాలో అత్తవారు; మధ్యను కోస్తాపొడవునా ఆంధ్రరాష్ట్రం అన్న తలపు రైల్లో చాలాసార్లు వచ్చింది. కాబోయే అత్తవారిని అత్తవారుగానే చూడా లనిపించింది పార్వతీశానికి—ఎంతగానో తనకు నచ్చిఉండకపోతే మిత్రుడు శాస్త్రి అంత ఖచ్చితంగా చెప్పిఉండడు.

తనకి ఈ ముప్ఫైఅయిదేళ్ళ వయస్సులో ఏ పదహారు పదిహేనేళ్ళ పిల్లో అయినకంటె కొంత వయసు ఎక్కువఉన్న మనిషి అయితేనే ఎక్కువ అనుకూలంగా ఉంటుంది. వివాహం అయిన ఏడాదిలోగానే భర్త గతించడమూ, తరవాత చదువు మొదలుపెట్టి పట్టుదలగా బి. ఏ. పాసయి, మాస్టరు ట్రెయినింగుకూడా అయిన మనిషి అంటే తనని బాగా అర్థంచేసుకోగలగాలి. ఆ మాత్రం క్వాలిఫికేషనుఉన్న మనిషికి మద్రాసులోనే ఉద్యోగం దొరకవచ్చును - వేణ్ణీళ్ళకి చన్నీళ్లు తోడుగా హాయిగా కాలం గడపవచ్చును; ముందుముందు పిల్లలు కలిగినా, తన ఒక్కడి జీతం మీదనే ఆధారపడనక్కర లేదుగనక అంత ఇబ్బంది ఉండదు.

అయితే శాస్త్రి ముందే స్పష్టంగా చెప్పాడు—"సంసారికి దక్కదన మెందుకనే మెచ్చువాణ్ణి కానుగాని, లేనప్పుడు స్పష్టంగా ఒప్పేసుకోవాలి—మధ్యేమా అవిడ ఒక అప్సరస అనుకొనిమాత్రం బయలుదేరకు - ఆకారంలో వికారాలు ఏమీ లేవు, అలాగని సౌందర్యరాశి కాదు; మామూలుగా మనలో చాలామందికి ఉన్నట్టే చిన్నప్పుడు దృష్టిదోషం ఉండడంతో రాత్రింబగళ్లు ఎక్కువగా చదవడం అలవాటు కాబట్టి మంచిదని కళ్ళజోడు పెట్టుకొంటుంది. అది ఆ మొగానికి బాగానే అమిరిందనాలి. మనిషిని చూడగానే ఆమె సౌందర్యంమీదకంటే తెలివితేటలమీదనూ, మాటపొందికమీదనూ దృష్టి నిలుస్తుంది."

శాస్త్రి చెప్పిన మాటలను తన ఊహలను మేళాయించి, భవిష్యత్తుకి సంబంధించిన బహువిధములయిన దృశ్యాలను మనోయవనిక మీద వీక్షించసాగాడు పార్వతీశం.

తానూ ఆమె మరో ఇద్దరూ-ఆ యిద్దరూ ఎవరో స్పష్టంగా కనిపించడంలేదు - రిజిస్ట్రారు ఆఫీసులో నిలబడిఉన్నారు. రిజిస్ట్రారుగారి పెద్ద పండు మీసాలే మొగమంతటికీ స్పష్టంగాకనిపిస్తున్నాయి-ఆయన ఏదో ప్రశ్న అడుగుతున్నాడు. ఆమె జవాబు చెప్పకుండా తనవంక చూసినవ్వింది. తనకూ నవ్వు వచ్చింది కాని, పెద్దమనిషి అతను అడిగిన ప్రశ్నకి జవాబు చెప్పకుండా నవ్వుకోడం ఏం బాగుంటుంది?

తాను బాల్కనీలో పుస్తకం చదువుకొంటూ కూర్చున్నాడు-తల్లీ కూతుళ్ళిద్దరూ స్కూలుకి వెళ్తున్నారు. దారి పొడుగునా అమ్మాయి ఏవో ప్రశ్న లడుగుతూనే ఉంటుంది. దూరానికి నల్లగొడుగు, ఆకుపచ్చచీర, చిన్నరంగుల పువ్వుల గొడుగూ మాత్రమే కనిపిస్తాయి. ఈ దృశ్యం అంతరించి ఇంకొకటి కనిపించేదిలోగా పార్వతీశం తనకితాను బోధపరచుకొన్నాడు- ఇది భవిష్యత్తుకి సంబంధించిన దృశ్యం కాదని, తను రాజమండ్రీలో ఉండేటప్పుడు ఆ విధంగా రోజూ తను యింటి పక్కనుండే వెళ్ళే ఒక స్కూలు మిస్ట్రెసూ



దీపకరాగం

—పి. గణపతిశాస్త్రి, శ్రీకాకుళం

 # రైలు ప్రమాదం 

తనకిస్తున్నది. తాను, అందమయిన పూవులను ఆమె తలలో తురుముతున్నాడు.

అక్కడ వాళ్ళ ఇంటిగురించి, వాళ్లు తనకిచేసే అతిథి మర్యాదలను గురించి, వాళ్ళతో తాను అనబోయే మాటలను గురించీ, ఎన్నెన్నో ఊహించసాగాడు. ఒక మారు ఆలోచనలో ఆమె అంత చదువుకొన్నదయినప్పటికీ కొంచెం పెళ్లికూతురు బిడియం కనపరుస్తూ కనిపించి లోనికి వెళ్లిపోయినట్లనిపించింది. ఇంకొకమారు ఆలోచనలో ఆమె ధైర్యంగా సరదాగా టేబిలు దగ్గర అవతలిపక్క కుర్చీలో కూర్చొని మాట్లాడుతున్నట్టు, పుస్తకాల విషయంలో ఇద్దరి అభిరుచులనూ కలబోసుకుంటున్నట్లనిపించింది—అలా లజ్జాన్వితగా ఉన్నట్టనిపించినప్పుడు ఆమె హిందూ సంప్రదాయానుగుణంగా ఎంతో బాగుందనుకొనేవాడు; రెండవ విధంగా తనతో కలిసిమెలిసి మాటాడినప్పుడు తనతో అన్నింటిలోనూ కలసివచ్చే, జీవన భాగస్వామిని దొరికినట్లనిపించింది. మనసులోగల కూలిమి ఎటువంటి నేరాలను దోచనియ్యకుండా చెయ్యగలదు.

ఇన్ని ఊహాలతో ఆశలతో బయలుదేరిన పార్వతీశానికి విజయనగరం చేరుకొనే సరికల్లా, మెయిలు మామూలుదారిని వెళ్ళదనీ, రాయపూరు - చక్రధర్‌పూర్‌లమీదుగా కలకత్తా వెళ్ళిపోతుందనీ తెలిసింది. దారిలో ఏదో బండి పట్టాలు తప్పిపోయిన ప్రమాదం కారణమట ఈ తిరుగుడుకి—

వెంటనే అనిపించిందేమిటంటే, ఇక్కడ దిగిపోయి, ఈ తరవాత ఏ రైలువస్తే అది, అందులో ఎక్కి తిన్నగా మద్రాసు చేరుకోవాలని. కాని, ఏదీ, వెంటనే ఏ రైలూ లేదు- తిన్నగా కలకత్తా వెళ్ళి అక్కడనుండి బరంపురం వెళ్లడం అన్నది చాలా చుట్టుదారి- అంతమేర తిరిగివెళ్లేకంటే, ఇప్పుడు తిన్నగా మద్రాసుపోయి, మరొకప్పుడు బయలుదేరి రావడం మంచిది - ఏది ఏమయినాసరే, ఈ రైలులో మరి ముందుకి వెళ్ళేదిలేదుకదా అని నిశ్చయించుకొని, కూలివాణ్ణయినా పిలవకుండా హోల్డాలూ సంచీపట్టుకొని తిన్నగా వెయిటింగు రూములోకి వెళ్ళి, అక్కడ అవి పడేసి, విశాలమైన వేత్తపడకకుర్చీలో మేనువాల్చాడు.

అతడలా కుర్చీలో విశ్రాంతిగా కూర్చొని వుండగా - రొక రెండుకప్పుల టీనీరు అతని ఉదరగోళంలో ప్రవేశించి వివిధ పరిణామాలను పొందుతున్నది. ఒక అరడజనుసిగరెట్లు కొద్దిపాటి రొయ్యిమినహా, గాలిలో కలిసిపోయేయి - కనబడని కాలచక్రంమాట చెప్పలేముకాని, అతని చేతివాచీలోనే కాదు, అన్ని సరైన కాలమాపక యంత్రాలలోనూ పెద్దముల్లు 270 డిగ్రీల కోణాలనీ, చిన్నముల్లు 22½ డిగ్రీల కోణాలనీ, సెకండ్లు సూచించేముల్లు 45 పరిభ్రమణాలనీ, లేదా 16200 డిగ్రీల కోణాలనూ లేదా II × 90 రేడియనులనూ సూచించాయి-ఏమిటి చెయ్య

డమా అన్న సందిగ్ధస్థితిలో కూర్చొని, ఒక నిశ్చయానికివచ్చిన పార్వతీశం మెదడులో కాలగతికి సంబంధించిన ఆయాస్ఫురణలు కొద్దిపాటి అంకెల వ్యత్యాసంతో మెదల సాగాయి.

హుషారుగా లేచి, బాత్ రూమ్ లోనికి వెళ్ళి ఒళ్లు కడుక్కొనివచ్చి బట్టలు మార్చుకొని, వెయిటింగురూము బేరరుకి సామాను అప్పజెప్పి, సిగరెట్టు ముట్టించి ఊళ్ళోకి బయలుదేరేడు.

బయలుదేరినవాడు తిన్నగా తొందరగా వెళ్ళిపోక ఓవరుబ్రిడ్జిమీద నిలబడి ఊరంతటినీ పరికించి చూసేడు - ఊరు చాలావరకు వెనకటిమాదిరిగానే ఉంది, కోట, కాలేజీ, పెద్దచెరువు అన్నీ క్షేమంగా యథాతథంగానే ఉన్నాయి కాని, స్టేషనుమాత్రం తాను చిన్నతనంలో మొట్టమొదటిమారు చూసినప్పుడు చాలా చిన్నదిగా ఉండేది. ఓవరు బ్రిడ్జి లేదు

బ్రిడ్జిదిగి తొందరగా వెళ్ళాలని బుద్ధి పుట్టలేదు-ఇందాక వెయిటింగు రూములో కుర్చీలో కూర్చొని ఉన్నప్పుడున్నంత బలంగా లేదు నిశ్చయం ఊళ్లోకి వెళ్లాలని-ఊళ్లో ఎవరో కొందరు దూరపు బంధువులున్నారు కొందరు స్నేహితులు కూడా ఉన్నారు ఊళ్ళోనే కాలేజీలోనో, కలక్టరేటులోనో, మ్యునిసిపాలిటీలోనో, ప్రయివేటు కంపెనీలలోనో పనులు చేస్తున్నారు. అయితే వాళ్లు మునపటి మనుష్యులు కారు. ఈ పది హేను సంవత్సరాల కాలంలోనూ సాంసారికంగా ఎంతో ముందుకి పోయుంటారు, మరే విషయంలోనూ అభివృద్ధి ఉన్నా లేకపోయినాను ఇప్పుడు వాళ్ళని కలియడం అంటే, ఎంత కాలంగానో తలుపు తాళం వేసి ఉంచిన పాతబడిన సామాను పడవేసే గదిని తెరవడంలాగుంటుంది. అందులో ఆనందమూ ఉంది, బాధా ఉంది, ఈ మధ్య కాలంలోనూ, ముఖ్యంగా ఇటీవల వాళ్ళని వేధిస్తూ ఉండిన సమస్యలన్నిటినీ ఆకళింపు చేసుకొని సానుభూతిని ప్రసరింప చెయ్యాలి. ఒకరి యెడల సానుభూతి చూపగలగడం మంచిదే గాని, ప్రస్తుతం తన మనస్థితి అందుకు తగినట్టుగా లేదు ఇంత కాలానికి తను మనసుమార్చి, తాను పెళ్లిచూపులకని బయలుదేరడమేమిటి? ఇంత మేరవచ్చాక ఈ రెండు వందల మైళ్లలోపున ఇటువంటి అవాంతరం వచ్చి పడడమేమిటి? మళ్లీ రైళ్లు సరిగా నడిచేసరికి ఎన్ని రోజులు పడుతుందో? అంతవరకూ తానిక్కడే ఉంటాడా? అంతకంటే ఏదో పాసింజరు ట్రెయిను పట్టుకొని, అది వెళ్ళినంతమేర రైలులో వెళ్ళి, అక్కడనుండి ఏ బస్సు మీదనో రైలు మీదనో అవతల మళ్ళీ రైలు నడిచే ప్రాంతానికి చేరుకోవడం సాగించాలి; అంతేగాని, ఇక్కడ ఎన్నాళ్ళు పడి ఉండడమూ?

అతనింకా బ్రిడ్జిమీద నిలబడివుండగానే రాయపూర్ నుండి వచ్చేరైలు వచ్చింది. ఎక్కే దిగే మనుషుల హడావిడిని గమనించడంలో కొంతవరకు తను ఏం చెయ్యడమూ అన్న సమస్యను మరిచిపోగలిగేడు.

బండిదిగి, బ్రిడ్జి ఎక్కివస్తున్న మనుష్యులలో ఒకగుంపులోనుండి ఒకగొంతు అతి స్పష్టంగా కీచుగా వినిపిస్తూంది ఇన్ని సంవత్సరాలకాలం గడిచినా ఆగొంతు మాత్రం పోలిక మారిపోలేదు - అవస్తున్న మనిషి, సోమరాజని నిశ్చయమైపోయింది. అతను తనను పోల్చగలడో లేడో అని ఎదురుతిరిగి నిలచున్నాడు. అతనిచూపు తన మొగంమీద పరీక్షగా ఒక్కక్షణం నిలిచినట్టయింది — కాని, పొరబడ్డాననుకొనిసాగిపోతున్నాడు పార్వతీశం' అతను కొంతమేర వెళ్లేవరకూ ఊరుకొని, తిరుగుడుతిరిగి దిగేవేళకు "సోమరాజూ!" అని పిలిచేడు తనకే కొంచెం అనుమానంగానే ఉంది, గొంతుతప్ప తక్కిన మనిషిలో ఏమీ అప్పటికళ లేదు-మీసాలు. పంచ, కోటు - అతను సోమరాజా కాక



"అబ్బె కాదోయ్! ఎప్పుడో యింతే. రంగస్థలంనుండి విరమించుకొని ఇక్కడ హోటలు పోసుంగుకోణం పెట్టుకున్నానేమోనని."

"ఓహో అదా నీమాట! తెలిసింది తెలిసింది- కాని పానకాలు హోటల్లో భోంచేసేక నీకా పేరుమీద వున్న దురభిప్రాయం పోతుందిలే. అయితే హోటల్లో నీ కోరిక ప్రకారం పర్వతాలు అని ఒక వడ్డనమనిషి కూడా ఉన్నాడు."

భోజనానంతరం సినీమాకి యింకా గంటన్నర టైముంది. అలా తిరగడం మొదలు పెట్టారు. తాను తరచు వస్తూ సేవున్నా, ఇంతకాలానికి వచ్చిన పార్వతీశంతో కలిసి చూడ్డంవలన అన్నీ తనకూ వింతగానే కనిపించసాగాయి. గంటస్తంభం, దగ్గరలోనే వున్న పెద్ద మురుగుకాలవా, దానికంపు భరించలేక ఒకటి రెండురోజులు కాలేజీకి శెలవు యిచ్చిన సంగతీ, కోటకందకం, మరాఫ్ఖానావారి వీధి, అప్పారావుగారి ఇల్లూ, దగ్గరలోఉన్న నటశేఖరుడు గిరీశంగారి కార్యరంగస్థలము, బొంకులదిబ్బా ఇవన్నీ చూసుకుంటూ పాతజ్ఞాపకాలను నెమరు వేసుకుంటూ సాగిపోతున్నారు.

అంతసేపూ ఏదో గొడవగా చెప్పుకొని పోతున్న సోమరాజు పార్వతీశాన్ని ప్రశ్నించాడు—ప్రయాణం ఎక్కడికి, ఏమిటి ఉద్దేశం అంటూ-బొంకులదిబ్బ ప్రభావమో, గిరీశంగారు జ్ఞాపకంరావడం ఫలితమో పార్వతీశం అప్రయత్నంగా అనేశాడు—"బరంపురం వెళ్ళాలని బయలుదేరేను - అక్కడ మా ముసలి మేనమామ ఒకగున్నారు సీతారామశాస్త్రి అనే మిత్రుడొకడున్నాడు వాళ్ళని మాడడానికి బయలుదేరేను" అన్నాడు.

సోమరాజు నొచ్చుకొన్నట్లుగా "అయితే నీకు ఆ కొసను బరంపురంలోఉన్న మిత్రులని చూడడానికి ఓపిక ఉందిగాని, దారిలో మేమంతా ఉన్నామన్న మాటే మరిచిపోయావన్నమాట? అంతేలే, ఎప్పుడయినా ముందువచ్చిన చెవులకంటె వెనకవచ్చిన కొమ్ములే వాడి."

పార్వతీశానికి తన అబద్ధాన్ని అర్ధాంతరంగా విడిచిపెట్టాలనిపించలేదు. "లేదోయ్! ఇంకా పదిహేనురోజులు శెలవుంది. ముందు అవతలి కొసవరకూవెళ్లి బరంపురం పని ముగించుకొని, ఇక్కడికి ఒకటి రెండు రోజుల్లోవచ్చి, మిమ్మల్నందర్నీ ఉద్ధరించాలనే. నాకు బోలెడు శెలవుంది; మీరంతా "ఇంక నీ ప్రయాణం ఎప్పుడు" అని అడిగే పర్యంతం శెలవు పొడిగించుకొంటూ ఇక్కడే ఉండదలచుకొన్నాను."

"మాటలకేంలే, అలా అయితే రేపు నాతో మా ఊరు రాకూడదూ? ఒక రెండు రోజులుండి వచ్చేద్దువుగాని."

"రేపా? ఉహూఁ ముందు బరంపురం వెళ్ళాలి. అక్కడ ఆ ముసలాయనను చూడాలి—అతనేం పెద్ద ఆస్తి ఉన్నవాడు కాడుగాని, ఏ కొంచెమయినా ముట్టజెప్పక పోతాడా అని." ఏనాడో చచ్చి స్వర్గానున్న మేనమామ-అతని అపరకర్మ ఖర్చులు కూడా తానే పెట్టుకోవలసి వచ్చింది—అతనివల్ల తనకి సంక్రమించబోయే ఆస్తిని గురించిన అబద్ధమయినా తాత్కాలికంగా పథ్యంగానే పనిచేసింది.

కబుర్లు చెప్పుకొంటూ అయ్యకోనేరు గట్టుమీదుగా కొంతమేర నడచి దూరం నుంచే ఆంజనేయస్వామి ఆలయాన్ని దర్శించి, మూడు మేడల వీధిలోనుండీ, వక్కలంకవారి వంకర సందుగుండా మూడు లాంతర్ల దగ్గరకి తేలేరు - పార్వతీశానికి దీవి మిరాయి జ్ఞాపకంవచ్చింది. అతను ఊరికినే జ్ఞాపకం వచ్చిందితప్ప ఇప్పుడేమీ తినలేమంటున్నా సరే సోమరాజు వెళ్ళి ఒక శేరు మితాయి, ఒక నాలుగణాలు పకోడీపొట్లాం కట్టించాడు—పార్వతీశం "ఇంకా నన్నిప్పుడు తినమంటావేమోనని భయపడ్డాను" అన్నాడు. "దానిసంగతి ఇప్పుడుకాదులే" అన్నాడు సోమరాజు.

కోవెలవీధిగుండా పార్కులోని సినీమా హాలుకి బయలుదేరేరు — అక్కడఉన్న రెండు సినీమాలలోనూ ఒకటిన్నర యుగ నాటి తెలుగు ఫిలిము; రెండవది ఏదో కొత్తదే హిందీ సినీమా. ఇద్దరికీ హిందీ బాగారాదు; అయినా ఇక్ష్వాకుల నాటి తెలుగుసినీమా చూడాలనిలేదు — హిందీ ఫిలిమ్ చూడాలని నిశ్చయించుకొన్నారు.

సినిమాలో ఇంటర్వల్ వరకూ మేం చూశాడో పార్వతీశం--ఆ తరవాత ఒకటే నిద్ర—సోమరాజుకి కూడా విసుగ్గానే ఉంది. ఇంకా కొంత ఉండగానే లేచి పార్వతీశాన్ని లేపాడు. హాలులోంచి బైట పడ్డాక "తిన్నగా స్టేషనుకి పోదామా?" అన్నాడు పార్వతీశం. అతని నిద్ర బద్ధకం సగం తగ్గింది.

సోమరాజు "స్టేషనుకి ఇప్పుడు వెళ్తే ఆ వెయిటింగు రూములోని మంచాలు కుర్చీలు అన్నీ ఆక్రమించబడి ఉంటాయి స్టేషను చుట్టూ ప్రదక్షిణం చెయ్యవలసి వస్తుంది. అంతకంటె ఇక్కడెక్కడో దగ్గర్లో పడుకొందికి చోటు చూసుకోడం మేలు." అన్నాడు.

"ఇక్కడ దగ్గర్లో సదుపాయంగా మనకి పడుకొందికి స్థలం ఎక్కడ దొరుకుతుంది?" అన్నాడు అమాయకంగా పార్వతీశం.

"నీ కెందుకు నేను తీసుకెళ్తాను కదూ?" అని దారి తీసేడు సోమరాజు. కస్పాలో ఎక్కడో ఏపికి తెలిసిన వాళ్లున్నారు కాబోలనుకొన్నాడు పార్వతీశం. ఆ నిద్ర

# ★ రైలు ప్రమాదం ★

బద్ధకంలో ఎవరినో లేపి, బాధ పెట్టకూడదనే ఆలోచన పోయింది. ఎక్కడో ఒక చోట హాయిగా నడుము వాల్చ గలగాలి.

ఇంకా ఎంతమేర నడవాలో అనుకొంటున్న పార్వతీశానికి ఆశ్చర్యం కలిగింది. అక్కడ కోవెల వీథిలోనే ఒక ఇంటి ముందు వాడు ఆగి తలుపు తట్టడం, పార్వతీశం మనస్సులో ఎన్నో అభ్యంతరాలు మెదిలేయి. కాని, వాటిలో ఏ ఒక్కదాన్నీ మాటల్లో పెట్టడానికి వ్యవధి లేకుండానే తలుపు తెరుచుకొంది.

సోమరాజు "నీ పాతివ్రత్యానికి అంటే పత్నీ వ్రతానికి ఏమి భంగం కలగదులే" అంటూ లోనికి తీసుకొని వెళ్ళేడు.

లోపల టేబిలువద్ద నున్న రెండు కుర్చీలలో తామిద్దరూ కూర్చున్నారు. ఇందాక కొన్న మిఠాయి అవసరం ఇప్పుడు పడింది. ఆమె ఇద్దరి ముందూ మిఠాయీ పకోడీలు ప్లేట్లలో ఉంచింది. గాజు గ్లాసులతో మంచినీళ్లు ఉంచింది. ఫలహారము పూర్తి అయే వేళకు కప్పులూ సాసర్లతో వేడిగా కాఫీ అందించింది. చిన్న వెండి పళ్ళెంలో సున్నంరాసి చిలకలుగా చుట్టిన తమలపాకులూ, వక్కపొడి, యాలక్కాయలూ పెట్టి ఇద్దరి మధ్యకూ టేబిలుమీద ఉంచింది. తాంబూలం వేసుకొని చుట్ట ముట్టించాడు సోమరాజు. పార్వతీశం సిగరెట్టు ముట్టించాడు. సోమరాజు సగర్వంగా "ఇందాకా మనం ఈ వీధంట వెళ్ళేంకదుటోయి, 'అంచేత కాఫీ కూడా సిద్ధంగా ఉంది' అన్నాడు.

"అలా అయితే నాతోపాటు ఆ సినీమాకి రాకుండా ఇక్కడే ఉండిపోలేకపోయావా?"

"బాగుంది, ఇన్నాళ్ళకి నువ్వు అలభ్యయోగంగా కనిపిస్తే నిన్నొక్కణ్ణీ సినీమాకి పొమ్మంటానా? మీ మద్రాసు వస్తే మాకు అటువంటి మర్యాదే చేస్తావు కాబోలు?"

"అయితే వీరు మద్రాసులో ఉంటున్నారా?" అంది ఆమె.

ఇక మొదలు పెట్టేడు సోమరాజు కోతలు——

మద్రాసు నగరం అంతా మనవాడి మాట మీద నడుస్తోందనీ, ఇవతల సినిమా లోకంలోనూ, అవతల రాజకీయాల రంగంలోనూ బ్రహ్మాండమైన కీర్తి ప్రతిష్ఠలున్నాయనీ, వెధవ జీతం అదంత ముఖ్యమయిందికాదు గాని, ఒక పదిహేను వందలుండక పోదనీ, ఎప్పుడూ కారులో తప్ప నడక అలవాటుండదనీ, ఇంటి దగ్గర పెద్దపెద్ద వాళ్లు కాచుకొని కూర్చొంటారనీ అలా అలా అల్లుకు పోసాగాడు మధ్యమధ్యను కాదని పార్వతీశం అడ్డు తగలడానికి ప్రయత్నించిన కొద్దీ మరీ విజృంభించ సాగాడు. ఇక మరి లాభం లేదని పార్వతీశం ఉపేక్ష వహించేడు. నిర్లక్ష్యంగా కూర్చోడంతో మళ్ళీ నిద్ర వస్తున్నానని సూచించింది.

సోమరాజు ఆమెతో అతనికి వేరేగా పక్క ఏర్పాటు చెయ్యమన్నాడు. పార్వతీశం తటపటాయిస్తూ ఉంటే, "నీ తపోభంగం చెయ్యడానికి ఏ అప్సరసలూ దిగి రారులే. ఇందాకా సినీమాలోనే అంతలో నిద్ర పోయావు. ఉదయం రైలుకి నేను వెళ్ళక తప్పదు. నువ్వు తాపీగా లేచి ఫలహారమూ అదీ చేసి స్టేషనుకి వెళ్లు. లేదా రేపు సాయంకాలం మెయిలు సరిగా వెళ్తుందేమో, అంతవరకూ ఇక్కడే స్వగృహంగా భావించుకొని ఉండు" అతని మాటలు పార్వతీశం సరిగా వినిపించుకోలేదు. వేగం ఒంటరిగా పోయి పడుకొంటే బాగుండు ననుకొన్నాడు.

పక్క చూపించడానికి సోమరాజు అతని వెనక ఆమె వచ్చేరు. ఆమె మంచినీళ్లు ఎక్కడ ఉన్నాయో, లైటు స్విచ్చి ఎక్కడ ఉందో చూపించింది. వెళ్తూ వెళ్తూ సోమరాజే లైటు ఆర్పేసేడు. అనుకొన్నంత బ్రహ్మాండంగా చీకటిగా లేదు. రెండు గదులకీ మధ్యనున్న గోడ ఇంటి పై కప్పుకి తగిలిలేదు. అందుచేత అవతలి గదిలోని నీలి బల్బు వెలుగు కొంత కనిపిస్తుంది.

అవతలి గదిలోనుండి కిలకిలలూ గలగలలూ గుసగుసలు——కొంతసేపు వినవచ్చేయి. వాటి వల్లనే తనకి నిద్ర పట్టడం లేదనుకొన్నాడు పార్వతీశం. అవి ఆగిపోయిన ఎంత సేపటి వరకూనో తనకి నిద్ర పట్టలేదు.

తాను ఎక్కడికి బయలుదేరేడు? ఎక్కడికి వచ్చేడు? ఇదంతటికీ కారణం ఏమిటి? ఈ సోమరాజెక్కడనుండి ఊడిపడ్డాడు?

తనకు జోగారావు మొదలయిన వాళ్లతో ఉన్న స్నేహం వీడితో చదువుకొనే రోజుల్లోనూ ఉండేది కాదు. వీడి ధోరణి మాటలూ వింటూంటే కేవలం భార్యాపిల్లలూ వీళ్ళకోసమే బతుకుతున్నాడా అనిపిస్తుంది. మళ్ళీ ఇక్కడ ఈ వ్యవహారం ఒకటి——అక్కడ బజార్లో మంగుల షాపువాళ్లతో మూడణాలకి గంటసేపు బేరం చేసి, బజారు ఈ చివరినుండి ఆ చివరివరకు మూడుమార్లు తిరిగాడు. ఇక్కడ ఈ విలాసం కోసం పది పదిహేను రూపాయలు నిర్లక్ష్యంగా పారెయ్య గలిగిన శక్తి ఉన్నాడు. ఇక్కడి వీడి వాలకం చూస్తే సంసారం చట్టుబండలూ ఏమీ లేని విలాస పురుషుడులాగుంది. కాని తెల్లవారడంతో రైలందుకొని మళ్ళీ ఆలోకంలో పడతాడు. ఇంత సులభంగా మనసులు ఎటుకావాలంటే అటు తిరుగుతూ అన్నిటినీ అనుభవించాలనే తత్వం తనకి అర్థంకాదు; అర్థం అయినా ఆచరణకి అసాధ్యమయినది. వీడు సోమరాజు తనకంటే మహాఉంటే వయసులో రెండుమూడేళ్లు మాత్రమే పెద్ద వుంటాడు. అప్పుడే తనపిల్లల పిల్లలగురించికూడా ఆలోచించేస్థితికి వచ్చేశాడు. తాను మాత్రం ఇంకా మొదటిసారుగా పెళ్ళిచేసుకోవాలని బయలుదేరేడు. అదీ ఇలా తయారయింది - ఇక్కడ ఈ వేశ్యాగృహంలో ఈ [illegible]ం మీద పడుకోడం ఒక్కరోజు కిందటకాదు, గంటకిందట, ఎవరయినా చెప్పినా నమ్మడానికి వీల్లేని సంగతే.

పెద్ద కుటుంబమూ, సాంఘికమయిన మర్యాదలూ ఎక్కువగా కావలసిన సోమరాజులాంటివాడికే తనకంటె యెక్కువ ధైర్యం వుంది. తను అవివాహితుడు. దగ్గరివాళ్లు కావలసినవాళ్లు ఎవ్వరూ లేనివాడు - అటువంటివాడు తానిదివరకెన్నడూ ఇటువంటి యింటిలో అడుగు పెట్టలేదే - అది కేవలం వాంఛా వైముఖ్యంవల్లనయితే గొప్పమాటే - అదేమీకాదు, తగిన సాహసమూ పట్టుదలా లేక, త్వరలో తానే ఒక నిశ్చయానికి రాలేక - పైగా యే వే గో

అవ్యక్తమయిన భయాలు - ఈ సోమరాజు లాంటివాడికి ఏభయాలూ లేవుకాబోలు!

ఉదయం మెలకువవచ్చేసరికి బాగాపొద్దెక్కింది. అయినా చేతివాచీ సూచించే ఎనిమిదింపావుని ఒకంతట నమ్మాలనిపించలేదు. తన పరిసరాలనుగూర్చి రాత్రి కలిగిన విస్మయంలో సగమయినా మళ్ళీ కలిగింది. వీడు సోమరాజున్నాడో వెళ్ళిపోయాడో? వాడు వెళ్ళిపోతే తనకిక్కడ ఏం పని? వెంటనే లేచి స్టేషనుకి పోవాలి. సామాను భద్రంగా వుందో లేదో?

ఆమె ప్రతి అయిదునిమిషాలకీ అతను లేచాడో లేదో వచ్చి చూస్తూ వుంది. ఈసారామె వచ్చేసరికి అతను లేచివుండడం గమనించి కాలకృత్యాలు తీర్చుకుందుకి తగిన అవకాశాలు కల్పించింది. మర చెంబుతో నీళ్లుపెట్టింది. కాగుపుడక నములుతూకూర్చున్న పార్వతీశానికి ఎంతకాలంగానో తాను లా ఆ పెరటి అరుగుమీద బల్లమీద కూర్చుని, ఎదురుగావున్న దానిమ్మచెట్టువంక చూస్తూ పళ్లు తోముకోడం అలవాటయిన సంగతిగానే తోచింది.

పళ్లుతోముకున్నాక బలవంతం చేస్తూవుంటే ఫలహారం చెయ్యకుండా ఎలా వెళ్లిపోవడం? తీరా హోటలునుండి తెప్పించేసిందికూడాను. రెండిడ్డెన్లు, ఒకదోసె, ఒక పెసరట్టు - అవితినడం పూర్తయేసరికి కాఫీ కలిపి అందించింది.

ఇకను మరి తాను వెళ్లడానికి అభ్యంతరం వుండదనుకున్నాడు పార్వతీశం — ఆమె అంది. ఇవాళైనా మెయిలు సరిగావెళ్తుందో, వెళ్ళదో? వెళ్లినా సాయంకాలంగాని రాదు. ఇప్పటినుండి వెళ్ళి ఏంచేస్తారు? రాత్రి మీకు సరిగా నిద్ర చాలినట్టులేదు. నా చేతి వంట తినడానికి మీకు ఇష్టం ఉండదేమో; హోటలునుండి తెప్పిస్తాను; భోంచేసి, ఒక్క గడియ పడుకొని ఏ మూడుగంటలకో బయలుదేరి వెళ్ళండి."

పార్వతీశానికి ఆమె అడిన మాటల్లో ఏ భాగానికి ముందు జవాబు చెప్పడమో తోచలేదు. సరే, ఎక్కడో ఒకచోట ఆరంభిద్దామని, "హోటల్లో వండేవాళ్ళ చేతులు ఇంతకంటే స్వచ్ఛమయిన వనుకోను—ఎవరు వండినా కాస్త పరిశుభ్రంగా ఉంటే చాలును. ఒక్క శాకాహారపు పట్టింపుతప్ప వంట వడ్డన ఎవరుచేసినా అభ్యంతరంలేదు - అలాగని అపరిశుభ్రంగా ఉంటే తినడానికి మనస్కరించదు"—

ఆమె ఏమీ జవాబు చెప్పకుండా అవతలి గదిలోనికివెళ్ళి నాటి తెలుగుదినపత్రికా, వారపత్రికలూ ఒక దొంతి పట్టుకొని వచ్చింది—

ఆ రోజు ఆమె చేతిపాకాన్ని ఏదో సాగత్తగా కాకుండా మనఃపూర్వకంగానే పొగడగలిగాడు పార్వతీశం—

సాయంకాలం స్టేషనుకి వెళ్ళి కనుక్కుంటే ఆ రోజు కూడా మెయిలు తిన్నగా వెళ్ళదని తెలిసింది—

ఆమె "రయిలుమాత్రం వెళ్ళకపోతే అక్కడ స్టేషన్లో ఉండిపోకండి. ఇక్కడికే వచ్చెయ్యండి" అంది—

అతనీమారు హోల్డాలూ, సంచీకూడా పట్టుకొని రిక్షామీద వచ్చేశాడు-- సామాను పడేసి, "ఎక్కడో హోటల్లో భోంచేసి, తిరిగి తిరిగి సినీమా రెండాటలట చూసివస్తానన్నా" ఆమె అతన్ని అట్టే బలవంతం చెయ్యలేదు.

అతనికి వీధులో పడ్డతరవాత తన పొరపాటు తెలిసివచ్చింది. ఇప్పుడు తను పాత స్నేహితులను చూడబోతే మళ్ళీ సామానెక్కడ ఉంచావంటే ఏమిచెప్పడం? అః అప్పటికి ఏదో సాకు దొరక్కపోతుందా? రైలు ప్రయాణంలో హోల్డాలు పోయిందంటే సరిపోలేదూ - ఈ మాత్రాని కింత గాభరాపడాలా?

కలియాలనుకొన్నవాళ్లెవరికీ కలియడం అయిందికాదు; కొందరు ఆవూళ్లోనే లేరు—మరికొందరు ఇళ్లల్లో లేరు - ఇంట్లో వాళ్లతో తన కులగోత్రాదికం మనవిచేసుకొందికి ఇష్టపడలేదు.

సుందర్రావుకోసం దాసన్నపేట చివరివరకూవెళ్లి వాడు ఆ సాయంకాలమే ఎక్కడికో ఊరికివెళ్ళేడన్న సంగతిని తెలుసుకొని, మరి ఎవ్వరికోసం చూడకుండా పోయి, భోంచేసి, హాయిగా పడుకోవడం మంచిదని నిశ్చయించుకొన్నాడు. మర్నాడు అటో ఇటో ప్రయాణం నిశ్చయం చేసుకోవాలనుకొన్నాడు. కాని, నగందారిలోకి వచ్చేసరికి మహారాణీపేటలోఉండే జోగారావుమాట జ్ఞాపకంవచ్చింది. నిన్ననుసోమరాజు చెప్పాడు- వాడిప్పుడే పదేళ్ళయిందిట ఇల్లు విడిచిపెట్టిపోయి. తను చదువుకొనే రోజుల్లో కొంతకాలం వాళ్లింట్లో ఉండేవాడు. పాపం వాళ్ల నాన్నగారు ఇద్దరినీ కూర్చోబెట్టుకొని పాఠాలూ, కథలూ చెప్పేవారు. ఆయ నెలా ఉన్నారో? ఆయన నొకమారు చూస్తే?

వెళ్ళేడు-ఆయన ఎత్తుగా ఉన్న వీధి అరుగుమీద చిన్న పడక కుర్చీలో కూర్చుని ఉన్నారు—నిద్రపోతున్నారో మేలుకొని ఉన్నారో తెలీదు — వయస్సు సుమారు డెభై ఉండవచ్చునుగాని, ఇంకా మరి పది పదిహేనేళ్ళ వార్ధక్యం మొగంలో గోచరిస్తుంది.

తను భలానా అని తెలిసిన తరవాత ఆయన మొగంలో ఆనందం ఆవేదనా రెండూ గోచరించాయి—"సుభిక్షలాభసాళ్ళకి వచ్చినట్టుగానే మావాడుకూడా ఒక నాడు గాకూడదా నాయనా!" అన్నారు. ఆ తరువాత ఇంకా ఏదో అనాలనుకొన్నారు-కాని, నోట మాట రాలేదు— లోతుగాఉన్న కళ్ళలోనుంచి వచ్చే కన్నీళ్లు ఆ మాసిన తెల్లగడ్డం మొగంమీద పారుతూ ఉంటే జోగారావు వెళ్ళిపోయేవన్న సంగతిలోని కష్టం బాగా అర్ధమయింది పార్వతీశానికి.

ఆయన కొంచెం సేపటిలోనే సర్దుకొని కుశల ప్రశ్నలు ప్రారంభించారు. పార్వతీశం లేచి శెలవు తీసుకొందామని ప్రయత్నించాడు. కాని, వీల్లేక పోయింది ఆయన ఒక రోజయినా ఉండకుండా వెళ్లడానికి వల్లకాదన్నారు. నిన్ను చూస్తూ ఉంటే, (ఆయనమాపు సరిగా కనిపించదుగాని) మా వాణ్ణి చూసినట్టే ఉందన్నారు- ఇక మరి మూర్ఖత్వం చేస్తేనేగాని రైటపడడానికి వీలులేదు. అయినా నిన్నటికి అక్కడ అయింది. ఇవాళ కిక్కడ పడుకోవలసి ఉంది కాబోలు అనుకొని సరేనన్నాడు.

ఇంట్లో ముసలాయనా, కోడలు అరుంధతీ మాత్రమే ఉన్నారు. జోగారావు తల్లి రెండేళ్ళక్రితమే పోయిందిట.

ముసలాయన ప్రక్కను కూర్చొని ఏవో కబుర్లు చెప్తున్నారు—ఆయన రాత్రి భోజనం చెయ్యడట. కొద్దిగా పాలుమాత్రం తాగి పడుకొంటారట. వడ్డిస్తున్న అరుంధతిని చూసిన దగ్గరనుంచి, పార్వతీశం మనసులో పదేపదే అడివి కాచిన వెన్నెల అన్నమాట తిరుగుడు పడసాగింది. కొన్ని కొన్ని సినీమా పాటల మొదటి ముక్కలు అప్రయత్నం జ్ఞాపకం వచ్చినట్టు.

మర్నాడుపుదయమే తెలిసింది, సాయంకాలం మెయిలు తిన్నగా వెళ్తుందని. మధ్యాహ్నం మూడుగంటలకల్లా ముసలాయన దగ్గర శెలవుపుచ్చుకొని సామాను తెచ్చుకుందుకి ఆమెయింటికి వెళ్లేడు.

# ★ రైలు ప్రమాదం ★



ఆమె "ఇప్పటినుండీ స్టేషనుకి రెండుకు మెయిలు" అంది.
వెళ్ళిపోర్చేడంకి అయిదున్నరకిగాని రాదు "ఎప్పుడువచ్చినా అసలు మెయిలులో



వెళ్ళడమూ, వెళ్ళకపోవడమూ సందేహంగా వుంది" అన్నాడు.

ఆమెతో తన పరిస్థితిని అంతా వివరంగా చెప్పుకొన్నాడు. ఆ క్షణంలో ఆమెకంటె తనకు మంచిసలహా ఇవ్వతలసినవారెవ్వరూ లేరనిపించింది. ఆమె అంతావిని శాంతంగా "అయితే ఇది నిదానంగా ఆలోచించవలసిన సంగతే" అంది. నాటి సాయంకాలం అతని ప్రయాణం ఆగిపోయింది. మర్నాటిపుదయం మెయిలులో అతను మద్రాసు వెళ్ళిపోయేడు దారిలో యెటువంటి రైలుప్రమాదాలు లేకుండా. తరవాతకొద్దిరోజులనాటికే జోగారావు తండ్రిగారికి ఒకవుత్తరం వచ్చింది. తమ కుమారుడు ఒకానొక రైలు ప్రమాదంలో పోయినసంగతి తనకు స్పష్టంగా తెలుసుననీ, ఆ సంగతే చెప్పాలని వచ్చికూడా, ముఖాముఖిగా చెప్పడానికి కష్టం తోచిందనీ, ఆయనకి అభ్యంతరం లేకపోతే తను కోడలిని వివాహం చేసుకుంటాననీ, తనను తండ్రిలాగ చూసుకుంటాననీ పార్వతీశం రాశాడు. ముసలాయనకి కళ్ళు సరిగా కనబడకపోవడంవల్ల అరుంధతే ఉత్తరం చదవవలసివచ్చింది.

ఉత్తరం చదవగానే అరుంధతికి పట్టలేనంత కోపంవచ్చింది. ముసలాయనకు ప్రచండమయిన దుఃఖం ముంచుకొచ్చింది. ఆమె ఇక్కేమీ నమ్మలేమంది. నాలుగయిదు రోజుల్లో ముసలాయనకి పార్వతీశం చేసిన సూచనలోని సబబు, సదుపాయమూ ముఖ్యంగా తన వృద్ధాప్యమూ, తన అనంతరం రక్షణలేకుండా అరుంధతి వుండవలసి రావడమూ ఆ యీ సంగతులన్నీ మనసుకి స్పష్టంగా కనిపించసాగాయి. ఆయన బలవంతంమీద ఆయన చెప్తూ ఉండగా అరుంధతే ఉత్తరం రాయకతప్పిందికాదు.

అరుంధతిని చూడగానే అడవిని కాచిన వెన్నెల అన్నమాట ఎలాస్ఫురించి మనసును విడవకుండా పట్టుకొందో, అలాగే పెళ్ళయిన కొంతకాలంవరకూ పార్వతీశానికి పరధ్యానంగా ఉన్నప్పుడల్లా "వారిజాక్షులందు వైవాహికములందు" అన్న శుక్రనీతిలోని పద్యం జ్ఞాపకం వస్తూవుండేది.

తనకి సకాలంలో సరైన సలహా చెప్పి సాహసాన్ని కలిగించిన సోమరాజు ప్రియురాలిని పెళ్ళికి పిలవలేకపోయినా మనసులో యెంతగానో ప్రస్తుతించుకున్నాడు; కృతజ్ఞతాసూచకంగా ఒక చిన్న బంగారపు గొలుసు బహూకరించాడు. కాని, నిజానికి తన కీసౌందర్యమూర్తి అరుంధతిని అందజేయడానికి ప్రధాన కారణమయిన రైలు ప్రమాదంమీద ఎంతకృతజ్ఞతను కలిగివున్నా బహుమతిని ఏ ఎడ్రసుకుపంపాలో తెలియక ఊరుకోవలసి వచ్చింది. ★



పరు జూచన్ వరు జూచు నొంప నలరింపన్ రోషరాగోదయా
విరతి భ్రూకుటి మందహాసములతో వీరంబు శృంగారమున్

జరగన్ గన్నుల గెంపు సొంపు
పరసాలోక సమూహమున్ నెఱి



రగం జండాస్త్ర సందోహమున్
ప్రచుం జంద్రాస్య హేలాగతిన్
- పోతన 'భాగవతం'

చిత్రకారుడు హెచ్ వి రామగోపాల్




# నరకాసుర సంహారం

పూర్వం నరకాసురుడనే రాక్షసుడుండే వాడు. అతడు చాలా దుర్మార్గుడు. దేవతలనందరినీ అనేక విధాలుగా బాధలు పెడుతూండేవాడు. ఇంద్రుని తల్లి అదితి చెవుల కుండలాలు ఎత్తుకు పోయాడు. వరుణదేవుని తెల్లని గొడుగుకూడా కాజేశాడు. ఇంకా మిగిలిన దేవతలనందరినీ అనేక విధాలుగా బాధలు పెడుతూండే వారంతా దేవేంద్రుని దగ్గిరికి వెళ్ళి మొర పెట్టుకున్నారు.

ఇంద్రునికి ఏమి చెయ్యడానికీ పాలు పోలేదు. "అందరినీ రక్షించేవాడు ఆ శ్రీ కృష్ణుడే గదా!" అని అనుకుని, భూలోకంలో ద్వారకా పట్టణంలో రాజ్యం చేస్తూన్న కృష్ణుని దగ్గిరికి వచ్చి, దేవతలు పడుతూన్న యమయాతనలన్నీ పూసగుచ్చినట్లు చెప్పాడు.

శ్రీకృష్ణుడు దేవతల బాధలువిని ఎంతో జాలిపడి నరకాసురుణ్ణి కూతిమార్చివెయ్యాలని నిశ్చయించాడు. వెంటనే గరుత్మంతుని వీపుమీద కూర్చుని యుద్ధానికి బయలు దేరాడు.

అప్పుడు సత్యభామ ఆయనతో "నన్ను కూడా మీతోపాటు యుద్ధానికి తీసుకు వెళ్ళండి! మీరు ఎలా యుద్ధం చేస్తారో చూడాలని ముచ్చటగా ఉంది." అని, అనేక విధాల బతిమాలింది. ఆ పైన శ్రీకృష్ణుడు సత్యభామతో ఇలా అన్నాడు. "యుద్ధం చాలా భయంకరంగా ఉంటుంది. అంతః పురంలో ఉద్యానవనంలో నాలుగడుగులు వేసేసరికి అలిసిపోయే దానవు! నీకేమిటి! యుద్ధానికి రావడమేమిటి! నా మాటవిను! యుద్ధంలో గొప్పగొప్ప వీరులే భయపడి పారిపోతూంటారు. నీవు చాలా సుకుమారివి. ఇట్టే అలిసి పోతావు. నాతో రావద్దు!" అయినా సత్యభామ పట్టినపట్టు విడవలేదు.

అప్పుడు కృష్ణుడామెను కూడా గరుత్మంతుని వీపుమీద కూర్చోబెట్టుకుని నరకాసురుడు పరిపాలించే ప్రాగ్జ్యోతిష పట్టణానికి బయలుదేరాడు. గరుత్మంతుడిద్దరినీ కనురెప్పపాటులో ప్రాగ్జ్యోతిష పట్టణానికి తీసుకుపోయాడు.

నరకాసురునికి కృష్ణుడు తనతో యుద్ధం చెయ్యడానికి వస్తున్నాడని తెలిసింది. ముందుగా మురాసురుడనే రాక్షసుణ్ణి కృష్ణుని మీదికి పంపించాడు. అతనికి అయిదు తలలున్నాయి! వాడు "గాండ్రు గాండ్రు" మని అరుస్తూ కృష్ణునితో యుద్ధానికి బయలు దేరాడు. వాడి అరుపులకు సమీపంలో ఉన్న కొండలన్నీ గజగజ వణికిపోయాయి! చెట్లు కూలిపోయాయి! వాడు వస్తూనే కృష్ణుని మీదికి ఒక పెద్దశూలం విసిరి వేశాడు.

కృష్ణుడది బాణాలతో ముక్కలు ముక్కలుగా నరికివేశాడు. ఆ పైన వాడొక గద విసిరి వేశాడు. అదికూడా కృష్ణుడు తుత్తునియలుగా నరికివేసి మరొక్క బాణంతో అతని అయిదు తలలు నేలమీద పడగొట్టాడు.

ఈ సంగతివిని మురాసురుని ఏడుగురు కొడుకులు కృష్ణునిమీదికి దండెత్తి వచ్చారు. కృష్ణునికీ వారికీ కొంతసేపు ఘోరంగా యుద్ధం జరిగింది. ఏమయితేనేం! చివరికి వారుకూడా అతని బాణాలకు బలిఅయి, ప్రాణాలు కోల్పోయారు.

నరకాసురుడు మండిపడి తానే స్వయంగా యుద్ధానికి వచ్చాడు. అప్పుడొక చిత్రం జరిగింది. ఇంతవరకు ఈ యుద్ధం అంతా చూస్తూఉన్న సత్యభామ తానే స్వయంగా నరకాసురునితో యుద్ధం చేస్తానని బయలుదేరింది. కృష్ణుడు మొదట వద్దన్నాడు. గాని చివరికి ఆమె యుద్ధం చెయ్యడానికి అంగీకరించాడు.

సత్యభామ రెప్పపాటు కాలంలో నరకాసురునిమీద బాణవర్షం కురిపించింది. ఇలాగ కొంతసేపు యుద్ధం జరిగేసరికి అతని సైన్యంలో ఉన్నవారంతా హడలెత్తి నరకాసురుని వెనకాల దాక్కున్నారు.

కృష్ణుడు సత్యభామ పరాక్రమానికెంతో సంతోషించి "సత్యా! నీ నేర్పు చూస్తే నాకెంతో ఆనందంగా వుంది! నీవింత గొప్పగా యుద్ధం చెయ్యగలవని నేనెప్పుడూ అనుకోలేదు. నీకేమికావలిస్తే అది బహుమతిగా ఇస్తాను. కోరుకో!" అన్నాడు. దానికి సత్యభామ చిరునవ్వు నవ్వి, సిగ్గుపడి, తల వంచుకొన్నది.

ఇంతలో నరకాసురుడు కృష్ణుణ్ణి ఎత్తిపొడుస్తూ "ఆడది యుద్ధం చేస్తూంటే చేతులు ముడుచుకొని చూస్తూకూర్చోవడం నీకేం మర్యాద! రాక్షసులను స్త్రీలతో యుద్ధం చెయ్యటం మర్యాదకాదు. మగవాడవైతే నీవే నాతో యుద్ధం చెయ్యి! రా! అని గద్దించాడు.

ఆతరువాత ఆయిద్దరికీ యుద్ధం ప్రారంభ

(61 వ-పేజీ చూడండి)



– పుల్లెల రామకృష్ణారావు (13)

...వెధవది. నేనంటే అందరికీ అలుసే. ముఖ్యంగా అమ్మకో! అన్నయ్య. నేనంటే ఎప్పుడూ ముక్కుమీదే ఉంటుంది వాడికి. లేకపోయినా ఏదో కల్పించి పురమాయిస్తాడు, "అది చెయ్యా! ఇది పట్రా!" అని. ఈమాటు చూస్తే వీడు చెప్పిన పని చెయ్యను. ఇంతకీ వీడి గొప్ప ఏమిటో! వెధవ ఇంటరు పాసయ్యాడు. అంతేగా, నాలా బొంగరం గువ్వాకొట్టి తిప్పగలడా? పోనీ చేతిలోకి తియ్యమనను, చూద్దాం; ఏదీ చేతకాదు. పైగా వాడేదో కలక్టరయినట్టూ, నేను వాడికింద నౌకరయినట్టూ మాట్లాడతాడు......అనుకుంటూ గుమ్మంలోకి అడుగుపెట్టాను.

"ఒరే! కృష్ణా! ఇలా రా!" అని నాన్నగారు పిలిచారు. ఇంటికి రాగానే కాఫీ తాగి ఆడుకుందికి పోదామనుకున్న నాకు నిరుత్సాహం పుట్టింది. "ఎందుకు నాన్నగారూ!" అంటూ లోపలికి వెళ్లాను. నాన్నారు ఒక రూపాయి కాగితం చేతికి ఇచ్చి, "వెళ్ళి అతిబాబు కొట్లో అరవీశె పంచదార పట్రా" అన్నారు. ఇంకా కాఫీ పెట్టలేదూ? అదేదో ముందరే అన్నయ్యగాడి చేత తెప్పించిపెడితే బాగుణ్ణే! ఇంతకీ వా డెక్కడో తిరుగుతూంటాడు. నేనే వచ్చినట్టు అన్నీ చెయ్యాలి... అనుకుంటూ బయలుదేరాను. ఎందుకంటే నాకు వేళకి కాఫీ లేకపోతే తలకాయనొప్పి పట్టుకొంటుంది.

నేను పంచదారా చిల్లరడబ్బులు పట్టుకొని ఇంటికి వచ్చాను. లోపల నుండి ఏవేవో మాటలు వినబడుతున్నాయి.

**బహుమతి పొందిన కథ**

"ఏమండీ! మన పెద్దాడిని ఎందులోనేనా ప్రవేశపెట్టండీ! వాడూ నాలుగు రాళ్ళు తెస్తే వేణ్ణీళ్ళకు చన్నీళ్ళలా ఉంటుంది." అంటోంది అమ్మ.

నేను వెళ్ళి కాఫీ కలుపుతూన్న అమ్మకి పంచదార ఇచ్చేను.

"నిండా పద్దెనిమిదేళ్ళు లేవు. వీడి కెవరిస్తారే ఉద్యోగం. మహామహా బియ్యేలు, ఎమ్మేలకే లేక ఇంట్లో నానుతూఉంటేనూ," అన్నారు నాన్నగారు.

"అలా అనకండి. ఏ పుట్టలో ఏ పాముందో! ప్రయత్నిస్తే దొరకొచ్చు! వాళ్ళ మూర్తి వీడికన్నా రెండు నెల్లేగా పెద్ద; వాడికి దొరికితే వీడికి దొరకదూ?" అంది అమ్మ.

"మీ ఆడవాళ్ళకి అదో చాదస్తం. కాని, నువ్వు చెప్పినట్టు వాడిని కలకత్తా, బటాచార్జీ గారి దగ్గరికి పంపిద్దాం."

* * *

అన్నయ్యగోల నాకు కొన్నాళ్లేనా విరగడ అవుతుందికదా అని సంతోషపడ్డాను. "కనకమహాలక్ష్మీ! తల్లీ! మా అన్నయ్య నెల్లాళ్లేనా ఆ ఊళ్లో ఉండిపోతే నీకు పాతిక కొబ్బరికాయలు కొడతాను" అని మొక్కుకున్నాను కూడా. ఎందుకంటే అన్నయ్య ఎప్పుడూ "ఒరే! కిష్టిగా! నిన్న చెప్పిన హోంవర్కు చేశావురా? నేను చెప్పిన సైన్సు పాఠం చదివావా? ఇవాళ ప్రశ్నలడుగుతాను తెలుసా. The Beggar Maid అన్న పద్యం రాత్రికి తప్పు చెప్పకపోతే వీపుమీద రంపోలు

# నాన్నగారి ఆఫీసు గది



బహుమతి పొందిన చిత్రం

ఎమ్. గురుప్రసాదరావు (9-సం॥), ఆదోని

వాయిస్తాను తెలుసా!" అంటాడు. పైగా ఎప్పుడైనా చదువుకుందికి పోయినా, సి. ఐ. డి. లా వెనకాలే వచ్చి, "ఒరే! కృష్ణా! ఎక్కడికిరా మిట్ట మధ్యాహ్నం. (సాయంత్రం మూడు గంటలయినా మా అన్నయ్యకి మిట్టమధ్యాహ్నమే లెండి.) పోయి ఆ పుస్తకం తీసి చదువుకో" అని టేబిలుమీద ఉన్న నా ఇంగ్లీషు పుస్తకం చూపెడతాడు. పోనీ, చదువుకోమన్నాడుకదా! అని ఏ పత్రికో తీసి చదువుతూంటే, వెనకాలే వచ్చి వీపుమీద ఒక్కటి చరిచి, "వెధవా! 'నీ క్లాసుపుస్తకం చదవరా' అంటే ఈ చెత్తంతా ఎందుకురా?" అంటాడు. మళ్ళా 'ఆ చెత్తంతా ఎందుకు' అని ఏ ఇంగ్లీషు మేగజైనో ఇచ్చి చదవమనేవాడు. "నా క్లాసు పుస్తకం కాదుకదా! ఇది చదవటం ఎందుకన్నయ్యా" అన్నాననుకోండి.

"చదవాలోయి వెధవాయి. అడ్డు ఫుల్లవెయ్యక. ఇలాంటివి చదవక పోతే రేపొద్దున దమ్మిడీకి మారవు" అంటాడు. ఆ బాధ తప్పుకోడానికి నాకు నచ్చిన పుస్తకం ఏ ఇంగ్లీషు మేగజైనులోనో పెట్టి చదివేవాణ్ణి. ఇప్పుడు వాడూరికి పోతే నా ఇష్టం వచ్చినట్టు తిరగొచ్చు, ఆడుకో వచ్చు. నాకే బాధా ఉండదు.

ఆ వేళ, అన్నయ్య ప్రయాణం. వాడి చేతికి ఓ ఉత్తరం, నూరు రూపాయలూ ఇచ్చి "జాగ్రత్తగా వెళ్ళిరా!" అన్నారు నాన్నగారు. అందులో ఒక రూపాయి తీసి నా చేతికి ఇచ్చి "ఒరే! జాగ్రత్తగా చదువుకో. వెధవ్వేషాలెయ్యక. ఇంద. ఇది తీసికొని ఏం చేసి కొంటావో చేసికో" అన్నాడు. నేను ఇంటికి వెళ్ళి మూలకూచున్న అమ్మమ్మతో "అమ్మమ్మా! సినిమాకి వెళుతున్నాను" అని బైట నుండే కేక వేసి ఒక్కపరుగు తీశాను.

కొత్తగా రిలీజయిన War of Worlds చూసివచ్చేసరికి రాత్రి పదయింది. నక్కుతూ, నానుతూ ఇంట్లోకి వెళ్ళేసరికి నాన్నగారు లేచి వచ్చి, చెవి మెలేసి "వెధవా! పరీక్షలు రెండు రోజులుంటే ఈ తిరుగుళ్ళేమిటిరా?" అని వీపుమీద వడ్డించారు. స్వర్గానికెళ్ళినా సవతిపోరు తప్పదన్నట్లు, అన్నయ్య లేకపోయినా నాకు జరగవలసిన పూజ తప్పలేదు.

*　　*　　*

నా పరీక్షలయి నెలరోజులు గడిచాయి. అన్నయ్య లేకపోవటం వల్ల ఇష్టంవచ్చినట్టుగా తిరిగాను. రేపే అన్నయ్య వస్తున్నాడని ఉత్తరం వచ్చింది; నా రిజల్ట్సు కూడా ఆనాడే తెలుస్తాయన్న తాజావార్తకూడా చెవిలోదూరింది. నాకు గుండెదడ పుట్టింది–అన్నయ్య వస్తున్నాడు; మన పప్పు ఉడకదు, అనుకొని. రానే వచ్చాడు అన్నయ్య, దిగులు మొగంతో. 'ఏదో అయింది' అనుకున్నాను.

నాన్నగారు "ఏరా! నువ్వెళ్ళిన పనేమయింది? ఆటాచార్జీగారు ఉద్యోగం ఇస్తానన్నాడా?" అని అడిగారు.

"లేదు నాన్నా! మొదట అతని తీరుచూసి ఇస్తాడనుకున్నాను. కాని అంతలో ప్లేటు మార్చేశాడు. 'అబ్బాయ్! నీకు చదువుంది; విజ్ఞానం ఉంది. కాని పెర్సనాలిటీ లేదు. అంచేత ఈ సంవత్సరం ఇంట్లో కూర్చొని మంచి బలకరమైన ఆహారం తీసుకో. వచ్చే సంవత్సరం కనపడు, తప్పకుండా ఉద్యోగం ఇస్తా' అన్నాడు. అలా అనటానికి కారణం ఇది. అతని తాలూకు దగ్గరవాళ్ళ నెవరినో నేను వెడదామనుకొంటున్న ఉద్యోగంలో ఇరికించాడు. ఎలాగైనా మనం పైవాళ్ళం కదూ! అంచేత మంచి మాటలతో సాగనంపాడు." అని తన ఉపన్యాసం ముగించాడు అన్నయ్య.

"పోనీలే. వచ్చే సంవత్సరమే వెడుదువుగాని" అన్నారు నాన్నగారు. ఇంతలో పక్కింటి వెంకటేశు వచ్చాడు నా రిజల్ట్సు తెలుసుకొని.

"ఓయి రామకృష్ణా! నీ పరీక్ష పోయిందోయ్" అని చావుకబురు



తోటికోడళ్లు

బహుమతి పొందిన చిత్రం

జి. సుబ్బలక్ష్మి (12-సం॥)—విజయనగరం

మెల్లగా చెప్పాడు. నా పరీక్ష తప్పి పోయింది అని వినేసరికి నా కాళ్ళు వణుకు పుట్టాయి. చివరలో...... 'గింయ్'..మని కళ్ళు తిరిగొచ్చాయి. పరీక్ష పోయిందని విన్న నాన్నగారు వచ్చి "ఏరా! వెధవా! శ్రద్ధగా చదవరా, అంటే చదివావు కావు. పరీక్ష పోగొట్టుకున్నావు. ఏం చేస్తావ్. చదివించేది దండుగ." అన్నారు. అన్నయ్య మాత్రం ఒక్క ముక్క కూడా అనలేదు. ఏమని కంటాడూ! వాడు వెళ్ళిన పని కూడా కున్నా చుట్టిందికదూ!

లోపల అమ్మ అంటోంది కూర తరుగుతూ. "పెద్దాడికి ఉద్యోగమూ రాలేదు. చిన్నవాడి పరీక్షా పోయింది. కాలం...కాలం..."

అవును. నిజమే. అన్నయ్య ఉద్యోగం - నా చదువు రెండూ రెండింటికీ వాయిదా పడ్డాయి. బాగా కుదిరింది - అనుకున్నా గూట్లోని పాత పుస్తకాలు బూజు దులుపుతూ.

★

# జడకుచ్చులు

— జంధ్యాల సరోజ (15)

బడిగంట విని - జీరాడుతున్న పరికిణీ పైకి పట్టుకుని పరుగెత్తింది లలిత. అప్పటికే క్లాసులో శశికళా, సత్యవతీ, సుజాత మొదలైన వాళ్ళంతా వచ్చారు. ప్రక్కనే కూర్చున్న సుజాత జడ కుచ్చులు పట్టుకుని చూస్తూ "ఎప్పుడు కొన్నారే యివి?" అంది లలిత.

"నిన్న సాయంత్రం" అంది సుజాత.

"మరి మా బజారుకు రాలేదే" అంది లలిత.

ఇంతలో సావిత్రీ, శకుంతలా వచ్చేరు. వాళ్లూ పెట్టుకున్నారు జడ కుచ్చులు! అందరిలో తనొక్కతేనా జడకుచ్చులు లేనిది! ఎంత బాగున్నాయో!

ఆరోజున లలితకు పాఠమే అర్థం కాలేదు. బడి వదులుతూనే ఇంటికి పరుగెత్తివచ్చి అమ్మతో-"అమ్మా! మా బళ్లో యెందరు జడకుచ్చులు కొన్నారనుకున్నావ్? ఎంత బాగున్నాయని! నాక్కూడా కొనుక్కోవే!" అంది.

"సరేలే, నాన్న రానీ"

"ఎప్పుడు వస్తాడో?"

"ఈ రాత్రికే వస్తారే, అత్తయ్యను పిలుచుకుని"

"నాన్న వస్తూనే తప్పకుండా కొనాలి చూడు."

"సరేలే, భోంచేద్దువుగాని రా" అంది అమ్మ.

లలిత ఆ రోజు నాన్నకోసం ఎదురుచూచి చూచి నిద్రపోయింది. నిద్ర లేచేటప్పటికి నాన్నా, అత్తయ్యా, రాధా, శంకరం కనిపించారు. తను నిద్రపోయిన తరువాత వచ్చారట.

"నాన్న వచ్చాడుకదా, మరి కుచ్చులూ" అంది లలిత అమ్మతో రహస్యంగా.

"ఇప్పుడు కొంటే, ఆ రాధ నాకూ కావాలని యేడుస్తుంది. వాళ్లు వూరికి వెళ్ళిపోయినతరువాత నీ కొక్కదానికే మంచి కుచ్చులు కొందాం. నీకూ ఆ పిల్లకూ కుచ్చులు కొనాలంటే, తక్కువ ఖరీదువి కొనవలసివస్తుంది. ఇద్దరికీ చాలా ఖర్చవుతుందికదూ? వాళ్లు వూరికి పోతూనే నీకు మాంఛివి కొందాం! ఏం?" అంది అమ్మ.

అత్తయ్యా వాళ్లెప్పుడు వెళ్ళిపోతారో? రాధ ఒక్కతీ రాకుంటే బాగుండును, అనుకుంది లలిత.

వారం గడిచింది. పదిహేను రోజులు గడిచాయి. అత్తయ్యా వాళ్ళు వెళ్ళిపోలేదు. ఇరవైరోజులకు వాళ్లు వెళ్ళిపోయారు. వాళ్ళను విడిచి రావటానికి పోతున్న నాన్నతో, జడకుచ్చులు తెమ్మని అమ్మ రహస్యంగా చెప్పింది.

"అబ్బే, ఇప్పుడు జడకుచ్చులు ఎవరు పెట్టుకుంటారు? అది ఫ్యాషన్ కాదు." అన్నాడు నాన్న.

"మాక్లాసులో అందరూ పెట్టుకున్నారు. వాళ్ళకు తెలియదేం?" అంది లలిత కోపంగా.

"వాళ్ల మొహం, వాళ్లకేం తెలుసు"అన్నాడు నాన్ననవ్వుతూ.

"ఏమో పిల్ల అంతగా అడుగు

## ★ జడకుచ్చులు ★

తూంది. వచ్చేటప్పుడు కుచ్చో ఒకటి తీసుకురండి" అంది అమ్మ.

"ఏవో ఒకటి కాదు. నాకు మంచివి కావాలి. లేకుంటే నేను అన్నమే తినను." అంది లలిత బెదిరిస్తూ.

"సరే తెస్తాలే" అని నాన్న వెళ్ళిపోయాడు.

నాన్న ఊరినుండివస్తూనే, నాన్న సంచీలో చూచింది లలిత. ఎక్కడా జడకుచ్చులు లేవు. లలితకు కోపం వచ్చింది. లలితనుచూచి నాన్న అన్నాడు. "జడకుచ్చులు తేవడానికి వీలులేదే"

"ఐతే నేనీరోజు అన్నమే తినను" అని లలిత కోపంగా వెళ్ళి పడుకుంది.

అమ్మా, నాన్న బలవంతంచేసి లలితచేత అన్నం తినిపించారు. "మన పక్కింటాయన ఈరోజు పట్నం పోతాడట. ఆయనతో నేను తెప్పిస్తానులే" అని చెప్పి ఒప్పించాడు నాన్న.

ఆరోజున లలిత క్లాసులో అందరి జడలూ చూచింది. ఒకరిద్దరుతప్ప, ఎవ్వరూ కుచ్చులు పెట్టుకోలేదు. లలిత ఆశ్చర్యంగా సుజాతను అడిగింది: "ఏమే జడకుచ్చులు పెట్టుకోలేదు?"

"నేను కుచ్చులు పెట్టుకోక వారమయింది. మొన్న మా మామ పట్నంనుండి వచ్చి జడకుచ్చులు ఫ్యాషన్ కాదని చెప్పాడు. నన్ను చూచి నవ్వాడు. ఆ రోజునుండీ




రైలుస్టేషన్ —కుమారి ప్రగడ సీతారాణి (5), నెల్లూరు



ఆలమంద

—చిప్పాడ అనసూయ (12), విజయనగరం.

నేను పెట్టుకోడం మానేశాను." అంది సుజాత.

"మరి వాళ్ళంతా యెందుకు పెట్టుకోవటం లేదు?"

"ఏమో, నన్ను చూచేనేమో? మేం అందరం తొందరపడి కొనుక్కున్నాం. మూలకు పారేశాం. నీదే మేలు, కొనుక్కోనేలేదు. మీ అత్తయ్యావాళ్లు చెప్పారేమో, ఫ్యాషన్ కాదని." అని అడిగింది సుజాత.

'ఊ' అని మూలిగింది లలిత ఆలోచిస్తూ.

ఇంటికిపోతూనే అమ్మ పిలిచి - "ఇదుగో నీ జడకుచ్చులు. వీటి కోసం యెన్నాళ్లు యేడ్చావు!" అంది.

"ఇప్పుడెందుకూ జడకుచ్చులు?" అంది లలిత జడకుచ్చులు చూస్తూ.

"అదేమిటే, నిన్నటివరకూ పట్టుపట్టి యిప్పుడు వద్దంటావ్?"

"ఫ్యాషన్ కాదట. మా క్లాసులో యెవరూ పెట్టుకోడంలేదు" అంది లలిత.

"ఫ్యాషన్ కాదే అని నేనా రోజు చెప్తే విన్నావా? తెచ్చింతర్వాత వద్దంటే ఎలా? పెట్టుకుని తీరవలసిందే" అన్నాడు నాన్న.

"ఊహుఁ. నేను పెట్టుకోను" అంది లలిత మూలుగుతూ.

"బాగుందే, ఇంతవరకూ కావాలని, యిప్పుడు వద్దని యేడుస్తున్నావా?" అన్నాడు నాన్న.

"ఏం ఫ్యాషనులో, వేలెడంత లేని పిల్లలకూ ఫ్యాషనులేనా?" అంది అమ్మ, ముక్కుపై వేలేసుకుని.

"పెట్టుకోకుంటే మానేగాని, ఏడవకు" అన్నాడు నాన్న, లలిత మొహంచూచి నవ్వుతూ.

ఆ ఫ్యాషన్ కాని జడకుచ్చులు చూచి, వాటికోసం తానెంత బాధపడ్డాను అనుకుంది లలిత నవ్వుకుంటూ. ★

# తిరుపతి ప్రయాణం

—యస్. వెంకట్రావు (౫)

ఇవి నా పల్లికు పరీక్షల తాలూకు కలవరరోజులు. ఇంకా పది, పది హేను రోజులు లాగితే రిజల్ట్సు తెలు స్తాయి. రోజులు దగ్గరపడుతున్న కొద్దీ నా గుండె కొట్టుకొనే స్పీడు కూడా పెరుగుతున్నది. ఐనా జరిగే దేదో జరుగకమానదు కదా! తప్పితేమాత్రం నాలుగు రోజులు భోజనం సరిగా చెయ్యం అని నిర్ణయం చేసికొని, ఆ ఉపవాసాల తాలూకు వదిలివేయవలసిన భోజ నాన్ని కూడా లెఖ్ఖకట్టుకొని, ఆ రోజునుంచే కాస్త ఎక్కువగా స్టాకు చెయ్యడానికి నిర్ణయించుకున్నా.

ఆరోజు మధ్యాహ్నం భోజనం చేసి ఇంటిల్లిపాదీ మధ్యగదిలో తలోమూల జేరబడిపోయాం. జోసు గాడు గిలక్కాయతో ఆడుకుంటు న్నాడు. బుజ్జిగాడు చాపమీదకు వంగి లెఖ్ఖలు చేసుకుంటున్నాడు. మధ్యమధ్య వాడు కళ్ళముందుకు వచ్చి పడుతున్న జుట్టు చేస్తున్న పనికి అంతరాయం కల్గిస్తున్నందు వల్ల ఎడమ చేత్తో పైకితోస్తున్నాడు.



నాన్నగారు పడకకుర్చీలో కూర్చుని పత్రిక చదువుకుంటున్నారు. అమ్మమ్మ గడపదగ్గర కూర్చుంది. తాతయ్య మాత్రం ఐదు సంవత్స రాల క్రిందట కొన్న పచ్చ పేము కుర్చీలో జేరబడి, ఆరంగుళాల చుట్టతో రైలుబండి పొగతో సాటి గల పొగను తయారు చేస్తున్నాడు. గాలిలో సుళ్ళుతిరుగుతూ నెమ్మ దిగా ప్రక్కనున్న కిటికీలోంచి జారు కుంటున్న పొగను మా చిన్న చెల్లెలు స్వర్ణవిచిత్రంగా చూస్తోంది. మధ్యమధ్య ఇంత పెద్ద పొగకు అధినాయకుడైన తాతయ్యవంక ఆశ్చర్యంతో చూస్తోంది.

నేను మాత్రం పట్టె మంచం మీద పడుకుని అప్పుడే వచ్చిన వారపత్రిక కుతూహలంతో చూస్తు న్నాను.

తాతయ్య పక్కనున్న కిటికీ లోంచి తుపుక్కున ఉమ్మేసి, ఒక్క సారి తన దూరదృష్టి తాలూకు కళ్ళ జోడ్ని సర్దుకొని, నాన్నతో అన్నాడు. "ఏమయ్యా ఈ ఏడాది కైనా మన బుజ్జిగాడి మొక్కు తీర్చే ట్టుందా" అని.

బుజ్జిగాడు మాత్రం ఈ మాట విన్నట్టు లేదు. వెంటనే అమ్మమ్మ అందుకుని "వాడు జబ్బుపడి రెండేళ్లు కావస్తోంది. ఆ తల పెరిగిపోతోంటే వాడు చిరాకుపడుతున్నాడు. ఈ ఏడాదే [illegible] కాస్త అవచేస్తే మన

భారం వదిలిపోతుంది. ఇక ఇంతల్లో ఖర్చులు ఇంకేమున్నాయి” అంది.

అంతటితో నాన్నగారు వార్తా ప్రపంచాన్ని వదిలిపెట్టి పత్రికలో దాచుకున్న తలను బయటపెట్టి, “పెద్దతిరుపతికి వెళ్ళాలంటేమాటలా? రెండు వచ్చనోట్లుంటే గాని వెళ్లి రావడం పడదు. ఆ వెంకట్రామయ్య ఇవ్వవలసింది యిస్తే పంపిద్దామనే అనుకుంటున్నా!” అన్నారు.

“అదేమిటి నాన్నా ఇంకా వాయిదా వేస్తున్నారు” అన్నాడు బుజ్జిగాడు.

నాన్నగారు ఉలిక్కిపడి నావంక చూశారు, ఆ మాట్లాడింది నేనే నేమోననుకుంటూ. కాని నా ముఖంలో ఆ లక్షణాలేవీ వ్యక్తం కాక పోవడంవల్ల మా బుజ్జివంకకు తిరిగి చూశారు. వాడు నాన్నగారి చూపులో చూపు కలిపి అన్నాడు. “అవును నాన్నా! నాకష్టం మీరేం పట్టించుకోరు. సెక్షనులో పిల్ల లందరూ ఒరేయ్ జడలబుట్టీ అని పిలుస్తున్నారు. ఇద్దరు ముగ్గురైనాతే చితకతన్నేవాణ్ణే. కానీ నలభై మందైపోయారు” వుక్రోషంతో కూడిన ఏడుపును దిగ్రమింగుకు న్నాడు వాడు. అది విని నాన్న గారికి నిజంగా నవ్వు వచ్చింది. కాని వాడు చూస్తే ఏడుస్తాడని పత్రిక చాటుకు తల తిప్పుకున్నారు.

“అవును బాబూ! వాడు లెక్కలు చేస్తుంటే చూడు జుట్టు ఎలా ముందుకు కళ్ల మీద పడిపోతోందో” అని అమ్మమ్మ ఆవిషయాన్ని తిరిగి ప్రతిపాదించింది.

నాన్నగారు మరొక్కసారి బుజ్జి గాడివంక చూశారు. వాడు కళ్ల మీదపడిన జులపాల్ని ఎడమచేత్తో



దొంగపిల్లి —కలబరిగి రామారావు (6), విజయనగరం

సైగల్‌లాగా పైకితోస్తూ అన్నాడు “నన్ను మర్యాదగా తిరపతిపంపిస్తే సరేసరి. లేకపోతే మూడుకాళ్లిచ్చి మంగలి రాఘవులు చేత తల గొరిగించుకోవడం ఖాయం.”

“ఛా! వెధవ సన్యాసీ. నోరూ వాయా లేకుండా కూయడమేనట్రా? అలా అనొచ్చా? స్వామివారికి ఆగ్రహం వస్తే మనం బ్రతకగలమా? పంపించకుండా ఏం చేస్తాడో చూస్తాగా మీ నాన్న!” అంది అమ్మమ్మ ధీమాగా. ఈ మాట మా నాన్న చెవులబడక ముందే అమ్మమ్మ రెండుసార్లు దవడ వాచిపోయేట్టు చెంపలు వేసుకుందని మీకు వేరే చెప్పనక్కర లేదనుకుంటా. ఇందాకటినుండీ మా అమ్మమ్మ చేస్తున్న యాక్షను మా నాన్నగారిమీద బాగా పనిచేసింది.

ఇంతలో తాతగారు కాలి పోయిన చుట్టముక్కను కిటికీగుండా విసిరేస్తూ “మనం స్వామివారికి అర్పణ నిమిత్తం మా పూళ్ళ దండాలి. అవో వంద రూపాయ లైనా, మరో వంద రూపాయలతో కులాసాగా వెళ్లిరావచ్చు” నని తేల్చేశాడు.

“ఈ పదో తారీఖు దాటితే మూఢమి వస్తుంది. కనుక పనిఅంతా పది రోజుల్లో అవజేయాలి సుమా” అంటూ ప్రవేశించాడు, ఎక్కడో చేతర్సుగా ఒక చిటికెడు పొడుం చేతబట్టుకున్న పంతులుగారు. తాత కుర్చీ ఖాళీచేసి శాస్త్రిగారిని ఆహ్వా నించాడు, తనకు అనుకూలంగా మాట్లాడినందుకు. ప్రోగ్రాం నిర్ణ యించబడింది. ఇంతసేపట్నుంచీ వీక్లీ పఠనానికి డిష్టర్బెన్సు వచ్చి

## ★ తిరుపతి ప్రయాణం ★

బాధపడుతుంటున్న నేను 'హమ్మయ్య!' అనుకున్నాను.

ప్రోగ్రాం ప్రకారం మూడో తారీఖున తెల్లవారుజామున లేచి తాతయ్యా, నేనూ తగు ఏర్పాట్లు చేయుటకు సంసిద్ధులయ్యాము. ఇక మా వాడికి తెల్లని పంచె కట్టి, మీద ఎఱ్ఱటి చీరముక్క ఒకటి కప్పాము. ఆ తరువాత నూట పదకొండ్లు పెట్టి, పావుకోళ్లు తొడిగి చేతిలో ఒక పళ్ళెం పెట్టాము. ఒక మర చెంబు మూతికి పసుపుగుడ్డ చుట్టి దానిని ఆ పళ్ళెములో ఉంచి భజంత్రీల వాళ్ళు ముందర, తరువాత తాతయ్య, మా వాడూ, ఆ తరువాత నేను బయల్దేరాం. నేను ఫలహారం పళ్లెం టేకప్ చేశాను. ఎందుకంటే ఆ రోజున ఉపవాసమవటంవల్ల వీలు చూచి నాలుగు ముక్కలు కడుపులో వదేసి ఆత్మారాముణ్ణి ఊరడించవచ్చు. మేము బయల్దేరేటప్పుడు మా యింటి ప్రక్కనున్న ముసలమ్మ మా వాణ్ణి చూచి గర్వంగా నవ్వింది. ఎందుకంటే మా వాడు ఆమెను రోజూ "సిటీ పోలీస్". అని వెక్కిరిస్తుంటాడు. మా వాడూ గుండుతో కనబడితే సంతోషించేందుకు తిరపతి త్వరగా పంపించమని ఆ మె అమ్మమ్మని ఒత్తిడి చేసేది కూడా.

మధ్యాహ్నానికల్లా మా వాడు చిల్లరతో నిండిన పళ్ళెం మోయలేకపోయాడు. మధ్యాహ్నం కలెక్షను లెక్కపెడితే ముప్ఫయి రూపాయల చిల్లర తేలింది. ఇంత కలక్షను వస్తుందని మా తాతయ్యగాని నేనుగానీ అనుకోలేదు. అన్నిటికంటె ఆశ్చర్యం ఏమిటంటే, మా వీధిలోవారు మొగమాటంవల్ల రూపాయలుకూడా పడవేశారు మా వీధిలో ప్రతిరోజూ ఎవళ్లో ఒకళ్లు మా వాడిమీద ఏదో ఒక కేసు తెచ్చేవారు. మా బల్బులు తీసేశాడని ఒకళ్లు వస్తే, మా సొరపిందె మచ్చుకైనా లేదని మరొకరు. రోజూ ఇదే వరస. అందుచేత వారు దేవుడి భక్తిమీద డబ్బులు వేశారో లేక మా వాడు గుండు చేయించుకు వస్తే సిగ్గుతో బయటకు రాకపోతే తమ సామాన్లు దక్కుతాయని

# ★ తిరుపతి ప్రయాణం ★

చేశారో గాని సాయంత్రానికల్లా యాభైనాలుగు చిల్లర తేలింది. ఆ నాలుగు రూపాయలు భజంత్రీల వాళ్లు తీసుకుపోయారు. మిగతా ధనం తాతయ్య భద్రంగా మూట కట్టాడు. తాతయ్య చూడకుండా తున్నప్పుడు జేబులో వేసుకొన్న బాపతు డబ్బులలో ఒక యూక లిప్టస్ ఆయిల్ బాటి లొకటి కొని వాళ్ళకు బాగా పట్టించాం మా బుజ్జిగాడూ, నేనూను. మిగతా రెండురోజులు మావూరి ప్రక్క పల్లెటూళ్ళకు పోయి దండగా అవో అరవై రూపాయలు తేలాయి. మా తాతయ్య ఇన్‌ఫ్లుయెన్సుమీద అరవై వచ్చాయనే చెప్పాలి. ఇంకేం మా నాన్నగారు మిగతాది పూర్తి చేశారు. పంతులుగారికి డబ్బు కిబ్బందిగా ఉందేమో మాకు త్వర లోనే ముహూర్తం పెట్టాడు.

ఇంతలో సారిజల్ట్సు వచ్చాయి. ఎంత వెదకినా నా నెంబరు కన్పించ లేదు. "వీడికి పాసగెరెక్కే చదవ లేదు. వీడికిగూడా గుండు చేయించండి" అజ్ఞాపించారు నాన్నగారు. నా ఉత్సాహం చచ్చిపోయింది.

ఎలా ఐతేనేం పదో తారీఖున సామానులన్నీ సర్దుకుని పెట్టెలతో బయల్దేరాం స్టాండుకి. "ముందర చిన్న తిరపతిపోయి తరవాత పెద్ద తిరుపతిపోదాము"ని తాత అన్నాడు. సర్లే అని వస్తున్న ఏలూరు బస్సు ఆపి అందరం ఎక్కాం. లగేజి అంతా పైనవేయించేశాను సక్రమంగా. మా తాతగారి కర్ర కొంత సేపటి తరువాత ప్రయాణీకులకు ఆటంకంగా ఉండడంవల్ల ఆయన కారు ఆగినచోట దిగి కర్రను టాప్ మీదికి విసిరాడు. మా స్కూల్ కెప్టెన్ స్పేర్‌తో విసిరినట్టుగా. అప్పుడే పైకెక్కి ఒక దబ్బనంవంటి ఆయుధంతో లగేజి తాలూకు బస్తా

# దీపావళి

వచ్చింది వచ్చింది దీపావళీ,
తెచ్చింది సరదాలు దీపావళీ!
    ఆనంద మొలికించు దీపావళీ
    అఖిల భారతదేశ శోభావళీ!

పిండివంటల జేయు
పండుగల లోకెల్ల
దండిగా సౌఖ్యాల
పండించు పండుగై

అల్లుళ్ళు కూతుళ్లు
అందరితో అన్నిళ్ళు
అలరారగా దివ్య దీపావళీ,
అరుదెంచె నీ నవ్య శోభావళీ!
        ॥వచ్చింది వచ్చింది॥

మెఱపు దొంతరలతో
కరవళ్ళు ద్రొక్కు-మా,
జ్యోత్స్నవలె మైమరువ
వెసెడి మతాబాలు,

రంగు రంగులతోడ
రమణీయముగ నెంతో
కనుల పండుగ జేయ
మన కందరికి నేడు
    వచ్చింది వచ్చింది_దీపావళీ!

మేడ మిద్దెలపైన
వేడుకతో గూడి
బాణసంచా లెన్నొ
బాగుగా వెలిగించు

బాలలను సరదాల
తేలించి తూలించి
కేళీ విలాసాల
మేళవింపులతోడ,
    వచ్చింది వచ్చింది దీపావళీ!

**తాళ్లప్రూడి వెంకటరమణ**



విష్ణుచక్రం    ఫోటో: ఎ. ఆర్. బోనేపల్లి

# దిబ్బు దిబ్బు దీపావళి

దీపావళి దీపావళి!
దిబ్బుదిబ్బు దీపావళి!
చీకటి నరకాసురుణ్ణి
చీల్చివేయు దీపావళి!
    దీపావళి దీపావళి!
    దిబ్బుదిబ్బు దీపావళి!
చాటిగులక పొట్లాలూ
మేటి వెలుగు ధరణాలు!
పిల్లలకూ పెద్దలకూ
ఉల్లాసము దీపావళి,
    దీపావళి దీపావళి!
    దిబ్బుదిబ్బు దీపావళి!
దివిని వెలుగు తారకలే
దిగివచ్చిన చందమ్మున
మెరసిపోవు చిచ్చుబుడ్లు
తరుగులేని దీపావళి,
    దీపావళి దీపావళి!
    దిబ్బుదిబ్బు దీపావళి!

తెలతెలవారే వేళా
తలలంటుకు స్నానమాడి
బాలబాలికలు టపాసు
పేలవేయు దీపావళి!
    దీపావళి దీపావళి!
    దిబ్బుదిబ్బు దీపావళి!
ముద్దర్వాళ్లు నునుసిగ్గున
ముట్టుకున్న మతాబాలు
ముదుసలి మొగు డొస్తాడని
ముసలమ్మలు గేలిసేయు
    దీపావళి దీపావళి!
    దిబ్బుదిబ్బు దీపావళి!
దీపావళి దీపావళి!
దశదిశలను దీపావళి
చీకటి యను రాకాసిని
చీల్చివెండు దీపావళి,
    దీపావళి దీపావళి!
    దశదిశలను దీపావళి!

**కె. కృష్ణవేణి**



# గజ తులాభారం

—రాళ్లబండి చిత్తరంజనదాస్
(14)



ఓ పెద్ద మహారాజుగారికి గొప్ప జబ్బుచేసింది. అనేకమంది వైద్యులు జబ్బు కుదర్చలేక విసుగెత్తిపోయారు. ధన్వంతరులు శిరోమణులు కూడా చేతకాదని నిరూపించుకున్నారు. రాజవైద్యులకి అసలది ఏ జబ్బో తలా తోకా అందింది కాదు. ఇంక రాజుగారికి, రాజుగారి బంధుమిత్రాదులకీ బెంగ లావైపోయింది. రోగం కుదిరే మార్గం కోసం వెతుకుతున్నారు.

రాజుగారి జబ్బు పోగొట్టేవారికి-వారి అంబారీ ఏనుగంత బరువుగల ధనాన్ని ఇస్తారు - అని ఊరూరా దేశదేశాలా చాటించారు...

ఎందరెందరో భిషగ్వరులు వచ్చారు; బిక్కమొహాలతో వెళ్ళిపోయారు. పతకాలు, ప్రశంసలూ, పొందిన వైద్యరత్నాలు కూడా వచ్చినదోవ పట్టారు. రాజుగారికి జబ్బుకన్నా బెంగే ఎక్కువైపోయింది!

ఆఖరికి ఓ పెద్ద పర్వతప్రాంతం లోంచి ఓ సిద్ధుడువచ్చి, రాజుగారి జబ్బును అవలీలగా మాయం చేశాడు. సాక్షాత్తు అతను పరమేశ్వరుడే అని రాజ్యం అంతా అతని పాదాలకు నమస్కరించింది - రాజు తన వంతోషాన్ని వెలిబుచ్చి ఏనుగెత్తు ధనం స్వీకరించమని సిద్ధుణ్ణి ప్రార్థించాడు—

"గురువాజ్ఞలేదు, నేను డబ్బు పుచ్చుకోను" - అన్నాడు సిద్ధుడు!

"ప్రాణదానం చేసిన మీ ఋణం ఎలా తీర్చుకోవడం?" అని రాజు ధనాన్ని తీసుకోమని ప్రాధేయపడ్డాడు...

"నాకివ్వదలచుకున్న ధనాన్ని విరివిగా బీదలకు పంచి యిచ్చేయ్"- అని సిద్ధుడు చెప్పి వెళ్ళిపోయాడు-

"ఖజానా ఖాళీచేసి ఏనుగెత్తు ధనం - జరూర్‌గా తేవాలి" అని హుకుం జారీచేశాడు రాజు.

అక్కడే వచ్చింది చిక్కు...

ఏనుగెత్తు ధనం! అంటే ఏనుగు ఎంత బరువు తూగుతుందో అంత బరువుగల ధనం! కాని ఏనుగును తూచడం ఎలా? ఏ త్రాసులో ఏనుగు పడుతుంది? ఏ కాటా గొలుసులు ఏనుక్కి ఆగుతాయి? రాజుకు మళ్లా మతిపోయింది. ఏమిటి ఉపాయం?

ఏనుగును ఎలాతూచడం? అన్న సమస్య లావైపోయింది ఆ రాజ్యంలో.

"ఏనుగును తూచేవిధానం కని పెట్టినవారికి వెయ్యివరహాల బహుమానం - " అని మళ్లా చాటింపు.

ఒప్పులకుప్ప ఒయ్యారిభామ

—వి. సీతాకుమారి (15 సం॥), వెల్లటూరు.

ఈ చాటింపు ఒక పన్నెండేండ్ల బీద అబ్బాయి విన్నాడు. విన్న దగ్గరనుంచి ఈ "గజతులాభారం" విషయం ఆలోచించడం మొదలెట్టాడు. ఏమీ పాలుపోయింది కాదు బాలలూ...! పోనీ మీరు చెప్పుకోండి చూద్దాం -!...




ఉఁహుఁ...! చెప్పలేరుకదూ? మరి వినండి -

ఆఖరికి ఆ అబ్బాయి కనిపెట్టాడు ఉపాయం! ఓ పెద్ద - లోతైన చెరువులో ... వెడల్పు, లావు, గల ఓ పడవ తేలించాలి. దానిమీద దళసరి బల్లచెక్కగాని, ఇనపరేకుగాని వెయ్యాలి. ఆ పడవను వడ్డునవుంచి, ఏనుగును మెల్లగా దానిమీద కెక్కించాలి. అప్పుడు ఆ పడవ నీటిలో కొంతవరకు మునుగుతుంది కదా! అది ఎంతవరకు మునిగిందో, అక్కడో ఆనవాలు పెట్టుకోవాలి.. తర్వాత ఏనుగును దింపెయ్యగానే పడవ యధాప్రకారం తేలిపోతుంది. ఇప్పుడు దానినిండా డబ్బు వెయ్యాలి. ఇదివరకుపెట్టిన "ఆనవాలు"వరకూ మునిగేదాకా...!

అయిందికదూ ఏనుగెత్తుధనం - డబ్బంతా బీదవాళ్లకిఅందిపోయింది. రాజు హృదయం ఆనందంతో నిండిపోయింది...

అబ్బాయికి వెయ్యివరహాలబహుమానం ముట్టింది. అందుకే మన పెద్దవాళ్లు అంటారు...ఏమిటో తెలుసునా ?... "ఉపాయం లేనివాణ్ణి ఊళ్లోంచి వెళ్లగొట్టాలి"-అని-! ★

# ఆటలో తెలుపిల్ల

— సూరంపూడి భాస్కరరావు

ఒకసారి సీత వాళ్ళ మేనత్తగారింటికి ఆకీడు వెళ్లి అక్కడ పద్యాల పందెం అని ఏదో ఆట నేర్చుకుని వచ్చింది. వచ్చిననాడే సుశీలని రాజ్యాన్ని సుందరిని వేధించుకు తినడం మొదలుపెట్టింది. ఆ వేళ సాయంకాలం తుమ్మిండ ఆడడం పూర్తి అయినాక, ఒక పక్కన చందమామ తొంగి చూస్తూంటే, నడవలో కూర్చుని కాసిని అటుకులు ఒళ్లో పోసుకుని మధ్య మధ్య నములుతూ ఆట మొదలుపెట్టారు.

సుశీల మొదట అందరికీ ఆట చెప్పింది. ఎవరో ఒకళ్లు మొదలుపెట్టి ఒక పద్యం చదువుతారు. ఆ పద్యంలో ఉండే ఆఖరి అక్షరాన్నందుకుని ఆ గుణింతంలోని అక్షరంతో మళ్ళీ ఇంకో పద్యాన్ని మొదలుపెట్టి చదవాలి. పక్కవాళ్లు మళ్లీ అలాగే చదవాలి ఎవరు పద్యం చదవలేకపోతే వాళ్ళు ఓడిపోతారు. ఇంకో విశేషం ఏమంటే 'ణ'కు బదులుగా 'న', 'ళ'కు బదులు 'ల', 'శ ష స'లలో దేనికైన వాటిలోదే మరోటి ఉపయోగించి పద్యం చెప్పవచ్చు. ఇవన్నీ చెప్పడం పూర్తయాక ఆటకి ఉపక్రమించారు.

సీత, సుశీల, జానకి, సుందరి, రాజ్యం వరసగా సున్నాలా కూర్చున్నారు. జానకిని మొదలు పెట్టమన్నారు. మొదలుపెట్టేవాళ్లకు బలే లాభం. సుఖంగా తడుముకోకుండా తన కిష్టమైన పద్యం చెప్పవచ్చు. సరే 'శ్రీరుక్మిణీశ కేశవ'తో మొదలుపెట్టింది జానకి. 'కృష్ణా' అని జానకి పూర్తిచెయ్యగానే, సుందరి "నల్లనివాడు పద్మ నయనంబులవాడు" అని సంగీతంతో అప్పచెప్పింది. రాజ్యం కూడా తొణకకుండా "రంగ దరాతిభంగ ఖగరాజ తురంగ" అని మొదలుపెట్టి 'దాశరథీ కరుణాపయోనిధీ' అని పూర్తిచేసింది. సీత "ధరసింహాసనమై...వర్ధిల్లు నారాయణా" అని ఏకరుపెట్టింది ఒక్క గుక్కలో.

సుశీలకి 'నల్లనివాడు' జ్ఞాపకం వచ్చిందిగాని, చదివిన పద్యం మళ్లీ చదవకూడదుగా! అందు చేత కొంచెం ఆలస్యమైంది. ఆలస్యమైన కొద్దీ తొందరెక్కువైంది. జ్ఞాపకం వస్తే చాలు చదివేద్దామనుకుంటూ "నభమందాడెడు మీన కర్కటములన్ బట్టెన్ సురల్ మ్రాన్పడన్" అని చదివింది. గజేంద్రమోక్షం కంఠస్థం చేసిన సీత "అదేమిటీ ఆఖరి బంతి మొదలెట్టావు?" అనేసరికి అంతా గొల్లుమన్నారు. పాపం నాయకురాలు సుశీల ఓడిపోయినట్లు ఒప్పుకుంది. మళ్ళీ వరస మొదలెట్టేసరికి పద్యాలకోసం తన్నుకోటం ఎక్కువైంది. వరస తిరిగి, రాజ్యం చెప్పడం మొదలెట్టి 'హరియించుచునుండు ముని గణాశ్రిత పదుడై' అని వాళ్ల నాన్నగారి దగ్గిర నేర్చుకున్న పద్యమేదో చెప్పింది. సీత కొంచెం ఆలోచనలో పడింది. 'డ డి డూ డే' అని గొణుగుతూ పద్యంకోసం వెతికి ఇంక ఏమైనాసరే అని 'డస్సెచేత బట్టి ధమధమ మ్రోగించి' అని మొదలెట్టింది ఆశుధారలో. అసలు ఛందస్సు ఏమిటో తెలియందే ఆశుధార నడుస్తుందా? కనీసం ఒక్క బంతైనా సక్రమంగా నడిచినందుకు సంతోషించాలి. సీతకి పద్యం వరస

# ★ ఆటలో తేలుపిల్ల ★

బాగా వంటబట్టింది. అందుచేత బుకాయించాలనో ఏమిటో 'డడ్డడాడ డాడ డడ్డడాడ' అని నడిపించింది వేమనపద్యం ధోరణిలో. మొదటిబంతి చెప్పినప్పుడు "గట్టెక్కిపోయాం" అనుకుంది సీత. కాని రెండోబంతి చదవగానే సీత ఓడిపోయిందని తేల్చారు. సీత వప్పుకోదల్చుకోలేదు 'అలాగే ఉంటుంది పద్యం' అని మొండి వాదానికి దిగింది. పైగా ఇలాంటి పద్యాలింకా చదువుతాను చూడు అని" ధాండడ ధాండ ధాండనిన దంబు లజాండముడిండ" పద్యం చదివింది. ఇంతలో -

"ఉండండర్రా!" అని కేకపెట్టి 'కోడి కోడి కోడి' అనడం ప్రారంభించింది సుందరి. అంతా సుందరి వంక చూశారు. సుందరి గడపకేసి చూస్తోంది. గడపమూలని తేలు పిల్ల నక్కింది. వెంటనే అంతా లేచిపోయారు. అది ఒక్క తేలు పిల్ల. వీళ్ళు అయిదుగురు ఉన్నారు. అయినా కొట్టటానికిమాత్రం ధైర్యంలేదు.

సీత "రాజూ రాజూ చెప్పవ్రటా" అని కేకపెట్టింది. నేను తేలు కుట్టిందేమో అనే అనుకున్నాను. నే నింకా వస్తూఉండగానే 'ఎఱ్ఱగా సన్నగా ముద్దుగా ఉంది. ఎంత బాగుందో' అంటోంది రాజ్యం. 'అయితేం తేలును చంపకుండా వదిలిపెడతామా ఏమిటి?' అని చెప్పతీసి చంపబోతున్నాను. ఇంతలోకే 'రాజూ రాజూ రాజూ' అని అదమాయించింది జానకి, కింది షడ్జమంలోంచి పై షడ్జమందాకా స్వరం హెచ్చించుతూను.

'ఏమిటి?' అన్నాను కోపం నటిస్తూను. నా కోపాన్ని ఏమాత్రం లక్ష్యపెట్టకుండానే "నా యెదురుగా చంపకు బాబూ. నాకు భయం. అసహ్యం కూడాను. తూ-ఆక్." అని కాం క్రిం చు కుం ది. అంత చూడలేకపోతే వెళ్ళిపోకూడదూ! అబ్బే, తనక్కడే ఉంటుందిగాని తన యెదురుగా దాన్ని చంపకూడదు. ఎల్లాగ? అవతలికి వెళ్ళమన్నాను. వెళ్ళలేదు. అసహ్యం చుకుంటూ నే చూస్తూనుంచుని 'అయ్యో పాపం' అంటూ నేను పరమక్రూరుణ్ణని నిరూపించాలి కాబోలు.

ఈలోగా సుందరి వేరే ఆజ్ఞ పెట్టింది. "రాజూ దాన్ని చంపద్దుగాని, దాని కొండేనికి దారం కడుదూ. కాసేపు వాళ్ళందరినీ ఆడిద్దాం," అంది.

"ఓహోహో! నాకు తేలు కుట్టించేట్టున్నారే మీ తంతు చూస్తే" అన్నాను విసుగ్గా వాళ్లతో వేగలేక. వాళ్లు ఎంత దేవాంతకులోగాని నాచేత ఇష్టమైన పనల్లా చేయించుకుంటున్నారు.

"కాదు. కాదు. నేనేం, కోడి కోడి అంటూ ఉంటాను. అదింక కదల్లేదుగా! అప్పుడేం, మెల్లిగా దారం ముడిపెట్టి దాని కొండికి తగిలించి బిగించేయి. ఏం." అంది సీత చిలిపిగా, ఉత్సాహంగా.

ఏమైనానరే అని ఒప్పుకుని దారం ముక్క తేవటానికి వెళ్లాను. సీత "కోడి కోడి" అని మెల్లిగా అంటుకుంది. నేను తిరిగివచ్చేసరికి ఊరదిరేలా కేకపెట్టేస్తోంది. తీరా చూస్తే ఏముంది? తేలూ లేదు కోడీ లేదు." మహో బాగా చేశారు. ఇంత కోడిమంత్రం ఊరికేపోయిందే." అన్నాను.

"ఏమో మరి. ఎంత గట్టిగా అన్నాగాని అది ఆగలేదు" అంది సీత బిక్కమొగంపెట్టి, పెద్ద నేరం చేసినట్టు.

కోడి కోడి అనగానే ఆ ధ్వనికి బెదిరి కొంచెం సేపు మొదట ఆగుతుంది తేలు. తరువాత ఈ చప్పుడు ఇంతేకదా, అని తనదారిని తను పోతుంది. ఇంతకీ ఆ వేళ తేలుపిల్ల కనపడేసరికి ఆట మూటకట్టేశారు. తన యెదురుగుండా చంపగూడదని అంతు పెట్టిన జానకి రాత్రి గంట సేపటిదాకా పక్కమీద దొర్లుతూ ఎక్కడ తేలుపిల్ల వస్తుందో అని హడలిపోతూ చదువు నున్న చుట్టింది. ★

# శైలి

— బి. సీతారామ్ (15)

ప్రతి పని చేయడానికీ ఒక తీరు వుంటుంది. ఆవిధంగా మనం ఆ పనిని చేయకపోతే, సరిగ్గా, తొందరగా అది పూర్తికాదు. ప్రతి పనీ మంచి విధాన చేస్తే, చేసే వాని నేర్పరితనం ప్రకటిత మౌతుంది. మాట్లాడుటకు-వ్రాయుటకు కూడా తీరు - తెన్నులున్నాయి. ప్రతి విషయాన్ని సరియైన పద్ధతిలో వ్యక్తపరచాలి. అట్లు వ్యక్తపరచనిచో అభీష్టసిద్ధి కలుగదు. అందుచేత వ్రాయుటకు మాట్లాడుటకు సరైన పద్ధతులేమిటో తెల్సుకోవల్సిన ఆవశ్యకత ఎంతైనా వుంది.

రాజపుత్రస్థానంలో జరిగిన ఓ సంఘటన. సామంతరాజు మహారాజుతో మాట్లాడుతున్నాడు. ఆ రాజుకొడుకు చాలా దుష్టుడు. అతడు తన తండ్రి అనుచరులను, సేవకులను అసహ్యించుకొనెడివాడు. వారంతా తమ ఆస్తిని తెగ తింటున్నారని తిట్టుతూ బాధ పెట్టుచుండెడివాడు. ఈ రాజు చనిపోయిన తరువాత, ఆ దుష్టబాలకుని చేతికి రాజ్యం వచ్చినట్లయితే, తనని

సుఖ - శాంతులతో ఉండనీయడని మంత్రి భయపడ్డాడు. తన యీ భయాన్ని రాజుతో చెప్పాలనుకున్నాడు. కాని రాజు ఎదుట వారి చావు విషయం మాట్లాడడ మెలాగు? అంటే అది అసభ్యానికి, అవినయానికి సూచకమౌతుంది. రాజుగారి కోపానికి గురి కావల్సివస్తుంది. అందుచేత బాగుగా ఆలోచించి మంత్రి ఇలా అన్నాడు- "తమ ఆయుస్సు నిండా నూరేళ్లు నిండిన తరువాత, నన్ను యువ రాజు సుఖ-శాంతులతో బ్రతుకనీయరని భయంగా వుంది." అతడు తన అభీష్టాన్ని ఎలా వ్యక్తపరిచాడో చూచారా!

ఓ రాజువద్దకు ఓ జ్యోతిష్కుడు వెళ్లాడు. రాజు అతనిని తన భవిష్యజ్జీవితాన్నిగూర్చి కొన్ని ప్రశ్నలడిగారు. ఆ జ్యోతిష్కునికి మాట్లాడేరీతి తెలియదు. అందుచేత యిలా చెప్పాడు- "తమరు అంతిమ దినాలు చాలా కష్టంగా గడపవల్సి వస్తుంది. మీరు మానసిక, శారీరక కష్టాలకు గురి అవుతారు పళ్లు వూడిపోతాయి. కళ్ళల్లోని జ్యోతి నశిస్తుంది. మీరు అటూ యిటూ తిరగడానికి అసమర్థులౌతారు. మీ కళ్లతో మీ పుత్ర పౌత్రుల మరణాలు చూడవల్సివస్తుంది." ఇలా ఎన్నో చెప్పతుండగా రాజు కోపించి అతనిని చెరసాలలో నుంచెను.

కొన్నాళ్ళ తరువాత యింకొక జ్యోతిష్కుడు కోటకు వచ్చాడు. అతడు మాట్లాడుటలో నేర్పరి. అందుచేత అతడు జాగ్రత్తగా మాట్లాడాడు. "మహారాజా! మీరు అన్నివిధాలా సుఖులు. ఈశ్వరుని వద్దనుండి తమరు నిండా నూరేళ్లు ఆయుస్సు పొందారు. తమ యిల్లు చుట్టాలు - పక్కాలు, కొడుకులు, కోడళ్ళు, మనుమలతో నిండివుంటుంది. 'తమ కుటుంబములో అందఱికంటె మీ ఆయుస్సే హెచ్చు' మొదలుగాగల వెన్నో చెప్పాడు" రాజు అతనికి పారితోషికమిచ్చి సమ్మాన పూర్వకంగా సాగనంపాడు.

ఇదంతా విన్న కోటసేవకునకు అనుమానం వచ్చి, వెళ్ళిపోతున్న జ్యోతిష్కుని ఆపి, మొదటి జ్యోతిష్కుని దుర్గతిని తెల్పి, "మీరు చెప్పిన విషయాన్నే అతడూ చెప్పెనుగదా అతనిని శిక్షించిరేమ"ని ప్రశ్నించెను. అది విని అతడు "నేను చెప్పినవి కూడ ఆ మాటలే. కాని ఆ జ్యోతిష్కుని భవిష్య కథనం సరిగ్గాలేదు. వంద సంవత్సరాలు బ్రతికేవాని పళ్ళు ఎలాగూ వూడతాయ్! కండ్లు ఏలాగూ కన్పించవు. కుటుంబములో అందఱికంటె అధిక ఆయుస్సు కల్గినప్పుడు అనే

(64-వ పేజీ చూడండి)







# బొంబాయి సినిమా లేఖ

చిత్రనిర్మాతలలో ఐకమత్యం పెంపొందించే ఉద్దేశ్యంతో ఫిలిం ఫెడరేషన్ అధ్యక్షుడు శ్రీ ఎస్ ఎస్ వాసన్ ఫిలిం ప్రొడ్యూసర్ల గిల్డ్‌లో సభ్యులుగా చేరారు. వాసన్‌ను అనుసరించే ఐ ఎం పి పి ఎ కూ గిల్డ్‌కూ మొదటినుంచీ స్పర్థలున్నాయి. తమ సంఘంలో చేరవలసిందని శ్రీ ఎస్ కె పాటిల్ ఆహ్వానించినప్పటికీ గిల్డ్ సభ్యులు ఒప్పుకోలేదు. గిల్డు తన ఏకాకి సభ్యత్వంతోనే వ్యవహరిస్తూవచ్చింది. ఫిలిం పరిశ్రమను అణచిపెట్టి వుంచగోరేవారూ, ప్రభుత్వమూ నిర్మాతలలోని అనైక్య భావాన్ని, అరాజకాన్ని అదను తీసుకొని వ్యవహరించారు. ఫిలింపరిశ్రమను పరిశ్రమగా గాని, విద్యాసాధనంగా గాని, కళగా గాని ప్రభుత్వం పరిగణించడం లేదు. సమాచార, బ్రాడ్‌కాస్టింగ్ శాఖ మంత్రి చూసే చిల్లర వ్యవహారాల్లో ఫిలింపరిశ్రమ ఒకటిగా జతచేయబడింది. ఈ పరిశ్రమపై ప్రభుత్వం సవతితల్లి ప్రేమ మాత్రమే చూపుతోంది.

ఐకమత్యం ఒక్కటే ఆశయంగా శ్రీ వాసన్ గిల్డులో చేరారు. గిల్డు సభ్యులందరూ బాగా పలుకుబడిగలవారూ, బాగా డబ్బు గడించినవారూ. వీరికి చిన్న నిర్మాతలతో కూడిన ఐ ఎం పి పి ఎ లో చేరడం చిన్నతనంగా తోచినట్లున్నది. ఈ రెండు సంఘాలను ఏకీభావం కుదర్చడం ఎస్ కె పాటిల్ గారికికూడా చేతకాలేదు. వాసన్ గారు ఆపని చేయగలరో లేదో చూడవలసి వుంది. దక్షిణాది నిర్మాతలందర్నీ ఆయన గిల్డులో చేర్చగలరా? చేర్చగలిగితే రెండు సంఘాలూ ఎప్పటికైనా ఒకటి అయ్యే అవకాశం వుంది. కాని గిల్డులోని ప్రస్తుత సభ్యులు వాసన్ గారికి అటువంటి అవకాశం ఇస్తారో ఇవ్వరో చూడాలి. ఇవ్వకపోతే శ్రీ వాసన్ గిల్డును వదిలిపెడతారో లేదో కూడా వేచి చూడవలసిన విషయం.


కుమ్యాను ప్రాస్ నిర్మిస్తున్న "బాంగావాలి" హింది చిత్రంలో షమ్మీ కపూర్.

* * *

ఈ యేడాది పైకి వచ్చిన తారలలో ఒకామె అమిత మరొకామె ఇందిర. "చైతన్య మహాప్రభు"లో భారత్ భూషణ్‌తో నటించిన అమిత తారాపథం అందుకున్నది. కాని ఆ తరవాత ఎందుచేతనో ఆమె తన పేరు నిలుపుకోలేక పోయింది. మళ్లీ "మునీంజీ" చిత్రంతో పూర్వపు పేరు తెచ్చుకున్నది. ఈమె వయస్సు 18 సం. మంచి భవిష్యత్తుగల తార. ఆమె నటనానైపుణ్యం కూడా ఎన్నదగినది. మంచి నర్తకి కూడాను. త్వరలో ఈమె అగ్రశ్రేణి తార కాగలసూచనలున్నాయి.

దేశ విభజనానంతరం జరిగిన అల్లరులలో బొంబాయివచ్చి చేరుకున్న తార ఇందిర. ఈమె రావడం నిరుపేదగా వచ్చింది. చిన్న చిన్న వేషాలు ధరిస్తూ, కష్టపడి పని చేసి పైకివచ్చినది. "మిర్జా గాలిబ్"లో సా[illegible]గా నటించింది. అప్పటినుండీ ఆమెకు పెద్దపెద్ద చిత్రాలలో బుకింగులవుతున్నాయి.

(ఆంధ్రవారపత్రిక విలేఖరి)

## చైనాలో భారతీయ చిత్రోత్సవం

చైనాలో ఇటీవల ప్రదర్శింపబడిన భారతీయ చిత్రాలు ఇతర కమ్యూనిస్టు దేశాలలో వలెనే అపారంగా ప్రజలనాకర్షించాయని వార్తలు తెలుపుతున్నాయి. 14 నగరాల్లో అయిదుకోట్ల ఇరవై లక్షల మంది ఈ చిత్రాలు చూశారట. భారతీయ ఫిలిం ప్రతినిధులు వివిధనగరాల్లో స్వయంగా ప్రేక్షకులకు దర్శనమిచ్చి స్వాగత సత్కారాలు పొందారు. ఈ ప్రతినిధులు చైనా అధ్యక్షుడు మావో సేటుంగ్‌ను, ప్రధాని చౌ-ఎన్-లైను కలుసుకున్నారు.

చైనీస్ యాత్రికుడు యువాన్ చ్వాంగ్ జీవితకథను చిత్రంగా నిర్మించదలచిన నిర్మాత చేతన్ ఆనంద్ అందుకు అనుమతి కోరుతూ ఒక విజ్ఞప్తిని చైనా ప్రభుత్వానికి దాఖలు చేశారు. ఈ చిత్ర నిర్మాణంలో భారత, చైనా, రష్యా దేశాలు పాల్గొంటాయి ★



జూపిటర్ వారి "నయా ఆద్మీ" హిందీ చిత్రంలో ఎన్. టి. రామారావు, జమున.



భారతీయ ఫిలిం ప్రతినిధులకు చైనాలో బ్రహ్మాండమైన స్వాగతం ఇవ్వబడింది సాంస్కృతికశాఖ తాత్కాలికమంత్రి చీన్ చున్ జూ, నటి కామినీ కౌశల్, సినిమా బ్యూరో డైరెక్టరు వాంగ్ లాన్‌సీ గార్లను ఫొటోలో చూడవచ్చును.

# మేరీ సీటన్ ఉపన్యాసాలు

చలనచిత్ర విమర్శనం గూర్చి భారత దేశంలో ఉపన్యాసాలివ్వడానికి ప్రభుత్వంచే ఆహ్వానింపబడిన మిస్ మేరీ సీటన్ ఇటీవల బొంబాయి వచ్చారు ఈమె ఆరు నెలలపాటు దేశంలో ఉపన్యాసలిస్తూ పర్యటిస్తారని తెలుస్తున్నది ఈమె బ్రిటిష్ జనిత చలనచిత్ర కళను గూర్చి, ముఖ్యంగా రష్యన్ దర్శకుడు ఐజెన్‌స్టీన్ జీవిత విశేషాలను గూర్చి గ్రంథాలు వ్రాశారు

బొంబాయిలో వెస్టర్న్ ఇండియా సినిమటోగ్రాఫర్స్ సంఘం ఏర్పాటు చేసిన సభలో ప్రసంగిస్తూ ఈమె అమెరికా, యూరప్ దేశాలలో చలన చిత్రకళ వివిధ రూపాలలో ఎలా అభివృద్ధి పొందినదీ వివరించారు అమెరికన్ చలనచిత్ర పితామహుడు డి డబ్ల్యు గ్రిఫిత్ నిర్మించిన "బర్త్ ఆఫ్ ఏ నేషన్"తో చలనచిత్రం ఒక కళగా రూపొందినదనీ, చిత్రానికి ఎడిటింగ్ ముఖ్యమైనదని ఆ చిత్రం మొదటి సారిగా నిరూపించిందనీ ఆమె చెప్పారు

చలనచిత్ర చరిత్రలో నూతనాధ్యాయం ప్రారంభించిన మరొక చిత్రం జర్మన్ దర్శకుడు రాబర్ట్ వీన్ నిర్మించిన "డాక్టర్ కాలిగరీ" అనీ, ఇందులో ఎక్స్‌ప్రెషనిస్ట్ శైలి ఉపయోగింప బడిందనీ ఆమె తెలిపారు

1926 లో విడుదల అయిన ఐజెన్ స్టీన్ చిత్రం "బాటిల్‌షిప్ పొటెమ్కిన్" మరొక గొప్ప చిత్రమనీ, వాస్తవిక పద్ధతిని, మాంటేజ్ పద్ధతిని ఈయన ప్రవేశ పెట్టారనీ ఆమె అన్నారు మన స్తత్వ శాస్త్ర సిద్ధాంతాలు ఆధారంగా ఫ్రెంచి దర్శకులు రీనీ క్లెయిర్, జర్మన్ డులాక్ మొదలగు వారు నిర్మించిన చిత్రాలు మరొక నూతనాధ్యాయం ప్రారంభించాయని చెప్పి, యుద్ధానంతరం ఇటాలియన్ చిత్రాలు నవ వాస్తవిక శైలిని ప్రవేశ పెట్టాయని ఆమె అన్నారు.

చలనచిత్రాలు యథార్థానికి సన్నిహితంగా ఉన్నప్పుడే చలనచిత్రకళ అభివృద్ధి అవుతుందని, తాను చూసిన భారతీయచిత్రాలన్నింటిలో "దో బిఘాజమీన్" ఒక్కటే వాస్తవికంగా ఉన్నదనీ ఆమె తెలిపారు

మేరీసీటన్ తనతో కొన్ని ప్రసిద్ధచిత్రాల భాగాలు తీసుకువచ్చారు ఉపన్యాసాలతో పాటు వీటినికూడా విషయ వివరీకరణం కోసం ప్రదర్శిస్తున్నారు

అమెరికన్ నవలా రచయిత అప్టన్‌సింక్లేర్ పెట్టిన పెట్టుబడితో ఐజెన్‌స్టీన్ మెక్సికోలో తీసిన "కో వివా మెక్సికో!" చిత్రం తాలూకు లక్ష అడుగుల ఫిలిమ్‌ను మేరీసీటన్ "టైమ్ ఇన్‌ది సన్" అనే పేరుతో ఎడిట్ చేసి విడుదల చేశారు ప్రాచీన మెక్సికన్ నాగరికతను చూపించే ఈ చిత్రాన్ని భారత ప్రభుత్వవిద్యాశాఖ ఆమె నుండి కొని పదిలపరచింది

## ఇండో - సోవియట్ చిత్ర నిర్మాణం

దర్శకనిర్మాత కె ఎ అబ్బాస్ నిర్మింపదలచిన "పరదేశి" చిత్రం నిర్మాణం వచ్చే ఏప్రిల్‌లో ప్రారంభం అవుతుందట రష్యన్ యాత్రికుడు అఫనాసి నికిటన్ జీవితం ఆధారంగా ఈ చిత్రం స్క్రిప్టు వ్రాయబడుతున్నది స్క్రిప్టులో సహాయపడుతున్న రష్యన్ రచయిత ఎమ్ పవ్లావా, దర్శకుడు ఎమ్ ప్రోనిన్ త్వరలో భారతదేశం వచ్చి రెండు నెలలపాటు ఉండి, స్క్రిప్టు వగైరా పూర్తిచేస్తారట ఈ చిత్ర నిర్మాణంలో రెండు దేశాల టెక్నిషియన్లు, నటీనటులు పాల్గొంటారు ఈ చిత్రం 'సోవ్‌కలర్'లో ఉంటుందట ఐజెన్‌స్టీన్ చిత్రాలన్నిటికీ ఫొటోగ్రాఫర్‌గా పని చేసిన ప్రసిద్ధ కామెరామాన్ ఎడ్వర్డ్ టిసే కూడా ఈ చిత్ర నిర్మాణంలో సహాయపడవచ్చునని ఇటీవలనే రష్యానుండి తిరిగి వచ్చిన అబ్బాస్ ప్రకటించారు

## "ఛత్రపతి శివాజీ" నాటకం

ఎస్ ఎల్ వి ఎస్ క్లబ్ ఆధ్వర్యాన గత మాసం 20 వ తేదీన "ఛత్రపతి శివాజీ" తెలుగు నాటకం మద్రాస్, అన్నామలై హాలులో ప్రదర్శితమైనది శివాజీగా కృష్ణమూర్తి, చంద్రాజీగా వెంకట్రావు, రఘునాథ్‌గా రామప్రసాదరావు, సరళగా కె ఆర్ తిలకం, కమలగా కళావతిగార్లు పాల్గొన్నారు నాటకానికి శ్రీ మోహన రంగంగారు దర్శకత్వం వహించారు



"ఛత్రపతి శివాజీ" నాటకంలో సరళ పాత్రధారిణి శ్రీమతి తిలకం.

"జెనాని కానుక"లో జమున.




(౬౨-వ పేజీ తరువాయి)

కుల మృత్యువులు పీలాగా కూడ వల్సి వస్తుంది. ఇవన్నీ చెప్పవల్సిన అవసరంలేదు." అన్నాడు జ్యోతిష్కుడు. అప్పు డర్థమయింది ఆ సేవకునకు, ఒకే విషయాన్ని, మంచి రీతిగా, చెడ్డరీతిగా కూడా చెప్పవచ్చునని.

ఇప్పుడు ఇంకో క్షేత్రంలోనికి వెళ్దాం. అమెరికాలో పది అంతస్థుల మేడ లుండడమనేది సామాన్య విషయమని మీ అందరికీ తెల్సు కదూ? అలాంటి ఓ మేడలో పదో అంతస్థులో నివసిస్తున్న వాడు ఒకడు ఓ రోజు సాయంకాలం తన గది ముందున్న పిట్టగోడ నానుకొని గోడమీద కూర్చున్నాడు. అతడు వార్తాపత్రిక చదవడంలో నిమగ్నమై వున్నాడు. ఇంతలో ఓ పిచ్చివాడు చేతిలో పిస్తోలుతో అక్కడకు వచ్చాడు. వస్తూనే భయపెడ్తూ, 'నీవు యిప్పుడే ఈ గోడమీదనుండి క్రిందికి దూకు. లేదంటే యీ పిస్తోలుతో నీ తల ఎగరవేస్తా' అన్నాడు ఆ ఉన్మాది. అతని ముఖలక్షణాలు చూస్తే కోపం ద్యోతకమవుతుంది. అతడు పేపరు అవతలుంచి పిచ్చివానివైపు చూశాడు. అతని బుర్రలో చక్కని ఆలోచన విద్యుల్లతలా మెరిసింది. క్రిందికి పారిపోదామంటే, పిచ్చివాడు మెట్ల తలుపు కడ్డంగా వున్నాడు. రెండు వైపులా మృత్యువు ఆహ్వానిస్తోంది. క్రిందికి గెంతకపోతే పిచ్చివాని పిచ్చితనానికి బలికావల్సి వస్తుంది. గెంతితే మంచినీళ్ళయినా అవుసరం లేదు. అతడు తన ప్రాణాల నెలా రక్షించుకొన్నాడో మీకు తెల్సా? నవ్వుతూ ఆ పిచ్చివానితో యిల్లా అన్నాడు. "నీవు ఎంత చిత్రమైన మాట చెప్పావు! నేను ఇంతకంటె విలక్షణమైన పని చేసి చూపిస్తా. పైనుండి క్రిందికి అందరూ గెంతుతారు. నేను రోడ్డుమీదనుండి పైకి యీ పదో అంతస్తులోకి గెంతుతాను." ఈ మాటలు విన్నాక పిచ్చివాడు నవ్వాడు. కోపానికి బదులు ప్రసన్నత, కుతూహలం అతని ముఖంలో దృగ్గోచర మౌతున్నయ్. 'నేను అలాంటి విపరీత కృత్యాన్ని తప్పకుండా చూస్తాన'ని త్రోవ యిచ్చివేశాడు. వెంటనే మొదటివాడు మెట్లుదిగి రాగానే తలుపు గొళ్లెం



ఓ. డి. కాశ్యప్ నిర్మిస్తున్న "ఆన్ బాన్"లో ఉషాకిరణ్, నళినీ జయవంత్.

పట్టి పోలీసులకు వప్పజెప్పాడు.

ఇంకో చిన్న సంఘటన మనవి చేస్తా. ఒక యింటి యజమాని తలుపులు తెరచివుంచి లోన పడక కుర్చీలో పడుకొని ఏదో చదువు కుంటున్నాడు. ఇంతలో ఓ దొంగ ఎలాగో వచ్చి ప్రవేశించాడు. పిస్తోలు చూపిస్తూ "నీ సమస్త వస్తువులు నా వశం చేయ్, లేదంటావా ఈ పిస్తోలుతోనే చంపివేస్తా"నన్నాడు. యింటి యజమాని వెంటనే యిలా అన్నాడు - "ఇంతకంటె పిరికితనం ఏదైనా వుంటుందా ? ఒక్క మనిషిమీదికి యిద్దరా కయ్యానికి రావడం ?" దొంగకు భయం వేసింది. "నే నొక్కడినేగా వచ్చింది? నాతో వచ్చిన యీ రెండోవాడెవడు ?" అనుకుంటూ వెనక్కు తిరిగాడు. ఇంతలో యింటి యజమాని వాని నడుము పట్టుకొని, పిస్తోలు లాక్కొని వాణ్ణి బంధించాడు. ఈ విధంగా తన ధనాన్ని, ప్రాణాన్ని రక్షించుకొన్నాడు.

ఇది మనోవిజ్ఞాన క్షేత్రం. దీనితో సాహిత్యశైలికి సంబంధమేమిటని మీరడుగుతారు. సంబంధం వుందో లేదో చెప్పేముందు 'శైలి' అంటే ఏమిటో మనవిచేసుకుంటా. వ్రాసేటప్పుడు-మాట్లాడేటప్పుడు రెండు పనులు జరుగుతాయి. మొదటిది ఆలోచించడం, రెండోది వ్యక్తపరచడమున్నూ. మనస్సునందలి భావాలను సరైన విధాన వ్యక్తపరచడానికే సాహిత్యములో 'శైలి' అంటారు. ఉత్కృష్ట భావాలను ఉపయుక్తమైన రీతిని తెలియపర్చడమే కృతియొక్క కళాపక్షం. అందులోనే కర్త కౌశలం, కృతిసౌందర్యం వుంటాయ్. శైలియే రచయిత పేరు పెట్టిపిలిచిపరిచయం చేస్తుంది. సాహిత్య సౌందర్యం, రచయిత విశిష్టత యీ శైలిమీదనే ఆధారపడివుంటవి.

## నరకాసుర సంహారం

(37-వ పేజీ తరువాయి)

గించింది. కృష్ణుడు నరకుని సైన్యాలమీద శతఘ్ని అనే అస్త్రం ప్రయోగించాడు. దానితో నరకుని సైన్యాలన్నీ చెల్లాచెదరై పారిపోయాయి. నరకుడప్పుడు గరుత్మంతుని మీద శక్తి అనే ఒకగొప్ప ఆయుధం ప్రయోగించాడు. దానికి గరుత్మంతుడు కొంచమైనా చలించలేదు. ఆతరువాత నరకాసురుడు ఒక పెద్ద వినుగుసెక్కి కృష్ణునిమీద పిడుగుల్లాంటి కత్తులు, కఠారులు విసిరివేశాడు. కృష్ణుడవన్నీ తన చక్రంతో ముక్కలు ముక్కలుగా నరికివేశాడు. నరకుడతనిమీద మళ్ళీ ఒక పెద్ద త్రిశూలం విసిరివేశాడు. కృష్ణుడదికూడా చక్రంతో తుత్తునియలు చేసి వెంటనే నరకాసురుని తలకూడా తెగనరికివేశాడు!

నరకుని తల తెగి నేలమీద పడగానే ఆకాశంలో దేవతలు దుందుభులు మ్రోగించారు. రంగురంగుల పువ్వుల వాన కురిపించారు. నరకాసురుని వంటి దుర్మార్గుడు చనిపోయాడుగదా! అని ప్రపంచంలో అందరూ ఆనందించారు. తరవాత కృష్ణుడు నరకాసురుడు ఎత్తుకుపోయిన అదితి కుండలాలు, వరుణదేవుని తెల్లగొడుగు మొదలైనవన్నీ వారి వారికిప్పించి వేశాడు.

నరకాసురుడు భూదేవి కుమారుడు. కనుక ఆమె కృష్ణుని అనేక విధాలుగా స్తోత్రంచేసి "నరకాసురుడు తాను చేసిన తప్పులకు తగిన శిక్ష అనుభవించాడు. అయితే అతని కుమారుడు ఒకడున్నాడు. అతడు ఏ పాపము ఎరగని వసివాడు. అతనికి తిరిగీ రాజ్యం ఇప్పించవలసింది." అని ప్రార్థించింది. కృష్ణుడు నరకాసురుని కుమారుడు భగదత్తుని మీద జాలిపడి అతనికి నరకుని రాజ్యం ఇవ్వవలసిందని ఉత్తరువు ఇచ్చాడు. పిమ్మట భగదత్తునికి ప్రాగ్జ్యోతిష పట్టణంలో పట్టాభిషేకం జరిగింది. కృష్ణుడు సత్యభామతో కలిసి తిరిగీ ద్వారకా పట్టణానికి వెళ్ళిపోయాడు.

నరకుని చంపివేసిన రోజే నరక చతుర్దశి. ఆ మర్నాడే దీపావళి పండుగ.

నరకుడు తన దుర్మార్గాలవల్ల భూలోకం నరకలోకంగా మార్చివేశాడు. కృష్ణుడతన్ని చంపివేసి మన లోకంలో ఉన్నవారందరికీ ఏ విధమైన ఇబ్బందులు లేకుండా రక్షించాడు. అదిజరిగి కొన్నివేల ఏళ్లు అయింది. అయినా ప్రజలు అప్పటినించీ అలాగే పండుగలు చేసుకుంటున్నారు. ★



వన్నెవన్నెల కాంతి
చిన్ని మోముల దోవ

—కేలూరి రాధాకృష్ణ.

Printed and Published for Nageswara Rao Estates Ltd., by S. Radha Krishna at The Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty Street, Madras-1. Editor S. Sambhu Prasad.